

ఆచార్య వంకలపాటి రామచంద్రచౌదరి

# చైతన్య కవిత

**21 & 22**

యువనామ సంవత్సరం

శరదృతువు - హేమంతఋతువు

విజయదశమి - సంక్రాంతి

**OCTOBER 1995**

**&**

**JANUARY 1996**

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

**చైతన్య కవితా వేదిక**

ఆర్-2, జ్ఞానభారతి

బెంగుళూరు 560 056

**CHAITANYA KAVITA**, a Journal devoted to Telugu Poetry and published by Chaitanya Kavita Vedika, R-2, Jnana Bharathi, Bangalore University Camps, BANGALORE 560 056. January 1996.

PP.Q ix + 78

ముఖచిత్రం : ప్రముఖకవి డా. జె. బాపురెడ్డి (హైదరాబాదు)

అట్టవెనుక : ప్రసిద్ధ తాత్త్వికుడు, చిత్రకారుడు, కవి
డా. యస్. సంజీవదేవ్ (తుమ్మపూడి, గుంటూరుజిల్లా)

అక్షరాలంకరణ : పి. సి. నరసింహారెడ్డి - బాపు

| | | |
|---|---|---|
| వెల : | విడిప్రతి | రూ 20-00 |
| | ప్రత్యేక సభ్యత్వం | రూ 200-00 |
| | జీవిత సభ్యత్వం | రూ 500-00 |
| | పోషక సభ్యత్వం | రూ 1000-00 |
| ప్రకటనలు : | నాల్గవ కవరు | రూ 5000 00 |
| | రెండవ కవరు | రూ 3000-00 |
| | మూడవ కవరు | రూ 2000-00 |
| | పూర్తి పుట | రూ 1000-00 |

For Copies :
1. Prof. T.V.Subba Rao
   Department of Studies in Telugu
   Bangalore University
   Jnana Bharathi, Bangalore - 560 056
2. Dr.R.V.S. Sundaram
   Reader in Telugu
   K.I.K.S, University of Mysore
   Manasa Gangotri, Mysore - 570 006
3. M/s Visalandhra Book House, Hyderabad
   and all its branches

D.T.P. : DATA CRAFT
No.16, Masilamani St.,
Madras - 17. Ph. 434 7353

Printing : PRINTEK PRINTERS
Magadi Main Rd., Basaveswara Nagar,
Bangalore - 79 Ph. 357763

# మనవి

1995 ఏప్రిల్ నెల నుండి చైతన్య కవితను త్రైమాసికగా మార్చాలనే ఆలోచన వచ్చింది. కాని దీనిని ఆచరణలో పెట్టలేకపోయాం. బెంగుళూరులో తెలుగు DTP సౌకర్యం లేకపోవడం మొదటి కారణం. ఎలాగో కష్టపడి DTP చేయించి ముద్రణకు ఇస్తే ప్రెస్సువాళ్లు చాలా ఆలస్యం చేయడం రెండవ కారణం. (టైలరు, కంసాలి, ప్రెస్సువాడు - ఈ ముగ్గురూ అన్నమాట మీద నిలబడరు. సకాలంలో పనులు పూర్తి చెయ్యరు). మార్చిలో ముద్రణకు ఇస్తే నవంబర్‌లో పూర్తిచేశాడు ప్రెస్సు మహానుభావుడు! (ఇకమీదట DTPమరియు ముద్రణ కోసం మద్రాసు, విజయవాడు, హైదరాబాదు నగరాలను ఆశ్రయించాలనుకుంటున్నాం). ఫలితంగా 19,20 సంచికలను కలిపి వేయవలసి వచ్చింది. ఒకసారి ఆలస్యం జరిగితే అది కొనసాగుతూ వస్తుంది. అందువల్ల 21,22 సంచికలను కూడా కలిపి ఒకే సంయుక్త సంచికగా ప్రకటిస్తున్నాం. పాఠకులు మన్నించగలరు. 1996 ఏప్రెల్ నెల నుండి పత్రికను సకాలంలో వెలువరించటానికి ప్రయత్నిస్తాం. త్రైమాసిక యోచన కట్టిపెట్టి షణ్మాసికంగానే కొనసాగిస్తాం.

ముద్రణలో జాప్యం మాత్రమే కాకుండా ఇంకోరకమైన కష్టంకూడా ఎదురయింది. ప్రసిద్ధ కవులెవరూ కవితలు పంపడంలేదు. పంపకుండా ఊరుకుంటే ఫరవాలేదు. ''చైతన్య కవితలో కవితలు బాగుండటం లేదని'' కామెంట్లు విసురుతున్నారు. తాము రచించిన ''గొప్ప కవితలు'' మాకు పంపరు. ఔత్సాహికుల కవితలు మేము ప్రచురిస్తే అవి బాగుండ లేవంటారు. వీళ్ల కామెంట్సులో పూర్తి సత్యం లేదు. నూతన యువకవులలో కొందరు బాగా వ్రాస్తున్నారు. పైగా ఓ మాదిరిగా ఉన్న కవితలు కూడా ప్రచురించి, ఔత్సాహిక కవులను ప్రోత్సహించాలనేది చైతన్యకవిత ఆశయాలలో ఒకటి.

ప్రసిద్ధ కవులు కవితలు ఎక్కువగా వ్రాయరు. పాత కీర్తి మీదనే బ్రతికేయాలని చూస్తూ ఉంటారు. ఒకటీ అరా వ్రాస్తే వాటిని నిత్యం తమ కవితా వస్తువులో దుమ్మెత్తిపోసే బూర్జువా వర్గాల పత్రికలకే పంపి, లక్షలకొద్దీ కాపీలలో తమ పేర్లు చూచుకొని మురుసిపోతూ ఉంటారు. అభ్యుదయ కవులు, విప్లవ కవులు, స్త్రీవాద కవయిత్రులు, దళిత కవులు, ఇలా అన్ని వర్గాల

కవులూ బూర్జువా వర్గ పత్రికలలో తమ కవితలు పడాలని తహతహలాడే వారే. దానికోసం పెద్ద ఎత్తున Under ground work కూడా చేయటానికీ, 'పట్టు పరిశ్రమ' స్థాపించటానికీ ఏ మాత్రం వెనుకాడరు. తమ తమ ఆశయాల ప్రచారంకోసం స్థాపింపబడ్డ పత్రికలకు ఈ ప్రసిద్ధ కవులు తమ కవితలు పంపరు. ఫలితంగా అభ్యుదయ, అరుణతార,లోహిత, నలుపు లాంటి పత్రికలు కూడా మా చైతన్య కవిత ఎదుర్కొంటున్న సమస్యలనే ఎదుర్కొంటున్నాయి. అమె చూర్స్ కవితలలోనే సరిపెట్టుకుంటున్నాయి.

పోనీ సంప్రదాయబద్ధులైన పద్యకవులైనా సహకరిస్తున్నారా అంటే అదీలేదు. పద్య కవితా సదస్సు స్థాపించి సంఘటితమైన పద్యకవులు కూడా బద్ధకస్తులే. ఉపన్యాసాలు ఇచ్చినంతగా కవితలు వ్రాయరు. అడపాదడపా వ్రాసినా, ప్రాచీనేతి వృత్తాలతో వ్రాస్తారు కాని తమ చుట్టూ ఉన్న సమాజాన్ని పట్టించుకోరు. (వీరిలో ఇది పెద్దలోపం. ఈ లోపాన్ని సవరించుకుంటేనే కాని వీరి ఉద్యమం బలపడదు). చైతన్య కవితకు కవిత్వం ప్రధానం కాని, ఛందస్సు మీద ద్వేషం లేదు. పద్యమైనా, గేయమైనా, వచన గేయమైనా, పాట అయినా ఏదయినా సరే, కవిత్వం అయితే చాలు ప్రచురిస్తాం. అయినా కవులు ఎక్కువగా స్పందించటం లేదు. ఈ పరిస్థితిని ఎదుర్కొందుకు, ఆంధ్రదేశమంతటా పర్యటించి, నగరాలలోను పట్టణాలలోను కవితాగోష్ఠులు నిర్వహించి, కవితలు సేకరించాలని తలపెట్టాం. ఖమ్మంలో ఒకసారి కవి మిత్రులు కె. సీతారాంగారి సహాయంతో 'రవళి' సాహిత్యసంస్థ ఆధ్వర్యాన ఒక కవితా గోష్ఠిని నిర్వహించాం. అది ఎంతో ప్రోత్సాహకరంగా ఉంది. ఈ పద్ధతిని కొనసాగించాలని నిశ్చయించాం.

మనకు వేయి సంవత్సరాల కవిత్వం ఉంది. దీంట్లో మార్గకవిత్వమూ ఉంది; దేశి కవిత్వమూ ఉంది. సంస్కృతంలో మహోన్నత శిఖరాలనంటిన మహోద్భుతమైన కవిత్వం ఉంది. ఆధునిక కవులకు ఈ సంప్రదాయ కవిత్వాన్ని గురించి ఏమీ తెలియదు. తెలుసుకోవాలనే ప్రయత్నమూ కనబడదు వారిలో. అసలు సంప్రదాయాన్నే నాశనం చేయాలనే రాక్షస గణం బయలుదేరింది ఈనాడు. వీళ్లని ధైర్యంగా ఎదుర్కొని, నిర్దాక్షిణ్యంగా అణిచి వేస్తేనే కాని తెలుగు కవిత్వానికి మోక్షం లేదు.

సంస్కృత కవిత్వాన్ని, తెలుగు సంప్రదాయకవిత్వాన్ని, జానపద కవిత్వాన్ని, వివిధ భారతీయ భాషలలోని కవిత్వాన్ని, ప్రపంచదేశాల రకరకాల

కవిత్వాన్ని యువతరానికి పరిచయం చేయాలనే తపన చైతన్య కవితకు వుంది. ఆ దిశలో ప్రయత్నాలు చేస్తున్నాం. ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారి కవిత ఒకటి 'ఉదయం' పత్రిక నుండి గ్రహించి ప్రచురిస్తున్నాం. 1995వ సంవత్సారానికి బిర్లాఫౌండేషన్ వారి 'సరస్వతీ సమ్మాన్'' అవార్డు (3 లక్షల రూపాయలు) పొందిన మలయాళ కవయిత్రి శ్రీమతి ఎన్. బాలమణి అమ్మ కవితఒకటి సంపాదించి వేస్తున్నాం (బేతవోలు రామబ్రహ్మం గారి 'గురుదత్తలహరి' పద్యాలు పుస్తక రూపంలో వచ్చేశాయి కాబట్టి ఆ పద్యాలను ముద్రించడం లేదు)

డా. జె. బాపురెడ్డి గారి ముఖచిత్రంలో చైతన్య కవిత తేవాలని చాలా కాలంగా అనుకుంటున్నాం. వారి సాహిత్యాన్నంతా సమీక్షిస్తూ ఒక వ్యాసం సంపాదించాలనే ప్రయత్నంలో ఈ ఆలోచన కార్యరూపం ధరించలేదు. చివరికి డా.జి.వి.సుబ్రహ్మణ్యంగారి ''అక్షరాల ఆలోచనలు'' అనే పుస్తకంలోని వ్యాసాన్ని గ్రహించి సంతృప్తిచెందాం.

డా.యస్. సంజీవదేవ్ గారిపై వ్యాసానికి బదులు ఒక ఆంగ్ల కవితను సంపాదించాం. సంజీవదేవ్‌గారు కోరిన వెంటనే తమ ఫోటోను రెండు కవితల్ని పంపించారు. వారికి మిక్కిలి కృతజ్ఞులం.

మంద్రాసు విశ్వవిద్యాలయంలోతెలుగు శాఖాధిపతిగా ఉన్న డా.వి. రామచంద్రగారు అందరకీ ప్రొఫెసర్‌గా మాత్రమే పరిచయం. కాని వారు చందోబద్ధమైన మంచి కవిత్వం అల్లగలిగిన దిట్ట. ప్రాచీన సాహిత్యాన్ని వ్యాకరణాన్ని బాగా జీర్ణించుకున్న పండితుడు. డొక్క శుద్ధిగల కొద్దిమంది తెలుగు ఆచార్యులలో ఆయన ఒకరు. రామచంద్రగారిని మా చైతన్య కవితలో కవిగా పరచయం చేస్తున్నందుకు సంతోషిస్తున్నాం, గర్విస్తున్నాం.

'కవి జహాపనా' కలుగోట్ల విజయాత్రేయ గారు రాయలసీమ కవిరత్నం. వీరిని గురించిన ఒక వ్యాసం ప్రచురించాలని చాలా కాలంగా ఆలోచిస్తున్నాం. వారిది సరియైన ఫోటో దొరక్కపోవడంతో ఆలస్యం అయింది. ఇంతలో వారు స్వర్గస్థులయ్యారనే దుర్వార్త చేరింది. వారు బ్రతికి వుండగా ఈ వ్యాసాన్ని ప్రచురించలేక పోయినందుకు మిక్కిలి చింతిస్తున్నాం.

క్రిందటి చైతన్యకవిత 19 & 20 సంయుక్తసంచిక కవయిత్రుల ప్రత్యేక సంచిక. దీంట్లో శ్రీమతి టి. వాణీరంగారావు గారి 'మళ్ళీ బ్రతకడం కోసం'

అనే కవిత ముద్రించాం. కాని ఆ సంచిక వెలువడిన నాటికి (నవంబర్ 1995 నాటికి) వాణీరంగారావు గారు మరణించారని విని చాలా బాధపడ్డాం. ఆ కవయిత్రి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాం. ఎవరైనా విమర్శకులు కీ.శే. టి. వాణీరంగారావు గారిని గురించీ ఆమె కవిత్వాన్ని గురించీ ఒక వ్యాసం వ్రాసి పంపితే చైతన్య కవితలో ప్రచురిస్తామని తెలియజేస్తున్నాం.

కవుల ముఖ చిత్రాలు వేసి, వారిని గురించిన వ్యాసాలు ప్రకటించడం ఒక పద్ధతిగా చైతన్య కవిత పాటిస్తోంది. కాని ఈ వ్యాసాలు విమర్శనాత్మకంగా ఉండటంలేదు. కేవలం పొగడ్తలుగా మాత్రమే ఉంటున్నాయి. కాబట్టి ఇక మీదట కవుల ముఖ చిత్రాలు మాత్రం వేసి, ఈ పరిచయవ్యాసాలు మానివేద్దామని అనుకుంటున్నాం. ఆయా కవుల బయోడేటాలు మాత్రం సంక్షిప్తంగా ప్రకటిస్తాం.

చైతన్యకవిత ఆర్థిక పరమైన ఇబ్బందిని ఎప్పటికప్పుడు తొలగించి పుణ్యం కట్టుకుంటున్న మహానుభావులు శ్రీ డి.కె. ఆదికేశవులు (శ్రీనివాసాట్రస్టు, బెంగుళూరు - చిత్తూరు) గారు. వీరు మా చైతన్య కవితా వేదిక అధ్యక్షులు. ప్రతి సంచికలోనూ వీరి వర్ణచిత్రాన్ని ప్రచురించాలని నిశ్చయించాం.

ఇలాగ కవిత్వాన్ని మాత్రమే ప్రచురించే తెలుగు పత్రిక ఆంధ్రదేశంలో కాని, ఇతర రాష్ట్రాలలో కాని ఎక్కడా లేదు. దీనిని నిలబెట్టుకోవలసిన బాధ్యత కవులమీదా, కవిత్వాభిమానుల మీదా ఉంది. తమతమ కవితలు పంపి సహకరించవలసిందిగా కవులకు, చందాదారులు కావలసిందిగా సాహిత్యాభిమానులకూ, ప్రకటనలు ఇవ్వవలసిందిగా పారిశ్రామిక వేత్తలకు ఇందుమూలంగా మనవి చేస్తున్నాం. చైతన్య కవితకు చందాలు (డి.డి. లేదా చెక్కు లేదా మనియార్డరు) ప్రొ. టి.వి. సుబ్బారావు పేరుతో పంప ప్రార్థన.

- సంపాదకులు

'జ్ఞానభారతి'
బెంగుళూరు
17- 2- 1996 (మహా శివరాత్రి)

# అంకితం

ఈ 20 వ శతాబ్ది

మూడవ పాదంలో చలనచిత్ర రంగాన్ని

నాల్గవ పాదంలో రాజకీయరంగాన్ని

అత్యద్భుతంగా ప్రభావితం చేసిన

అభినవ రాముడు, అభినవ కృష్ణుడు

తానే రావణుడు, తానే సుయోధనుడు

విశాలాంధ్ర ప్రజాభిమానం వెల్లువలో తేలియాడే

తెలుగుల తొలివెలుగుల వెండి ఓడ

టంగుటూరి వారి అడుగు జాడ

**నందమూరి తారక రాముడు**

నవకోటి ఆంధ్రుల నయనాభిరాముడు

నభూతో నభవిష్యతిగా బ్రతికిన

అపురూప వ్యక్తిత్వపు తెలుగు వీరుడు

18-1-1996 నాడు

హఠాన్మరణ రాహుగ్రస్తుడైన

అందాల చందమామ ఎన్.టి.ఆర్.

'ఆంధ్ర మహావిష్ణువు' దివ్యస్మృతికి

అంజలి ఘటిస్తూ....

- సంపాదకులు

# నమో! నమస్తే!

ఈ సంచిక యొక్క
ముద్రణ వ్యయాన్నంతటినీ
గొప్ప ఔదార్యంతో భరించిన
ప్రియమిత్రులు
నిగర్వి
దాన కర్ణుడు
'దళవాయి' వంశ తిలకుడు
రుక్మిణీ - కృష్ణస్వామి నాయుడు దంపతుల జ్యేష్ఠపుత్రుడు
చిత్తూరు - బెంగుళూరులో ఉన్న
శ్రీనివాసా ట్రస్టు మేనేజింగ్ ట్రస్టీ
అయిన

**శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు**గారికి
మా నమశ్శతములు...

''నమో నమస్తే ఉస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే!''

**- సంపాదకులు**



'దానకర్ణుడు'

శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు

బెంగుళూరు

# దళవాయి దానకర్ణుడు

పరమ పావనమైన భరత ఖండాన
అతి సుందరంబైన ఆంధ్రదేశాన
శ్రీలు పొంగెడి గడ్డ చిత్తూరు సీమ
పంచ వర్ణాలతో ప్రభవిల్లు సీమ
బంగారు సీమలో 'బలిజ' కులాన
అవతరించెను మాదు 'ఆదికేశవులు'!

వీరుల వంశాన శూర కులాన
'దళవాయి' సంప్రదాన తళుకు చంద్రుండు
సరసుండు ఆ 'కృష్ణస్వామి నాయుండు'
పరగంగ 'రుక్మిణి'న్ బరిణయంబాడ
ప్రద్యుమ్నుడై పుట్టి భాగ్యముల్ వడసె
అత్యున్నతుడు 'డి.కె. ఆదికేశవులు'!

కవి పండితుల పాలి కల్పవృక్షంబు
తనర నర్థుల దన్పు దాన కర్ణుండు
శ్రీనివాసుని గొల్చు శిష్ట భక్తుండు
కంచి శృంగేరీల నంచిత భక్తి
చిరకాలమున నుండి సేవించు ఘనుడు
సత్య సాయుని పాద స్వచ్ఛ పద్మముల
నిత్యంబు విహరించు నీటైన తేటి
సత్రాలు నిర్మించె క్షేత్రాలలోన

వేద శాఖల పూలు 'ఆది కేశవులు'!
సకల సద్గుణ కీర్తి సౌజన్య మూర్తి
ఇల నేలు 'పీ.వీ.' కి తలలోని నాల్క-
ఈసారి కాంగ్రేసు కోశాధి కారి!

'చెంగమ్మ' కన్నుల బంగారు బొమ్మ
'ముని వెంకటస్వామి' ముద్దు కూతురును
'సత్య ప్రభా' దేవి సద్గుణంబులకు
మెచ్చి పెండ్లాడగా హెచ్చె సత్కీర్తి
వంశాభి వృద్ధియు వరుసతో వచ్చె
'తేజేశ్వరీ' దేవి, దివ్య 'కల్పజ' యు
'శ్రీనివాసు' ని తోడ సిరిమల్లె తోట
మూడు పువ్వుల బాట, ముత్యాల మూట!

కూతుళ్లు అల్లుళ్లు కొడుకు కోడలును
మనుమరాంద్రును మనుమలును కలుగుచు
తామర తంపరై దళవాయి కులము
ధరణిలో నా చంద్ర తారార్క-ముగను
సిరి సంపదల తోడ చెలగును గాక!
ఆరోగ్య మాయువు నఖిల సత్కీర్తి
ఓ 'ఆదికేశవా!' ఒనగూడు నీకు
శ్రీ రస్తు! శుభమస్తు! శివమస్తు నీకు!!

- తంగిరాల సుబ్బారావు.

# శరత్తారలు - హిమబిందువులు

# బాపురెడ్డి భావభౌతికవాదం

- జి.వి. సుబ్రహ్మణ్యం

సాహిత్యం ఎప్పుడూ క్రొత్తదనాన్నీ, క్రొత్తదర్శనాన్నీ కోరుతుంటుంది. క్రొత్తదనాన్ని ఇంగ్లీషులో నావెల్టీ అంటారు. దానివల్ల సాహిత్యానికి చమత్కారం కలగవచ్చు, అభినవ సాహిత్య స్ఫూర్తి విడంబించవచ్చు. అందులో మొదటిదానికంటె రెండవది ఆదరణీయం, ఉపాదేయం. సాహిత్యంలో ఈ క్రొత్తదనాన్ని పాశ్చాత్య విమర్శకు లొక కావ్యలక్షణంగా భావించారు. దాన్ని పరిశీలించే విధానాన్ని నిర్దేశిస్తూ టి.యస్. ఇలియట్ ఇలా వివేచించాడు- ''Wheather the impression of novelty has been created to surprise or shock as an end in itself or whether it is the product of true originality of the genuinely new or of the expression in fresh and arresting ways of permanent and universal truths". పఠితలకు అబ్బురపాటు కలిగించటం, తబ్బిబ్బులు పెట్టించటం చమత్కార మార్గాన్ని అనుసరించే నవ్యత లక్షణం. ఇది ఉత్తమం కాదు. పదాలగారడీ గాని, అంత్య ప్రాసల లీలావిలాసం కానీ, వక్రతావిన్యాసం కానీ, శ్లేష చమత్కృతి కానీ, ఉక్తుల పారడీ కానీ కొత్తగా అనిపించవచ్చునుగాని కలకాలం నిలచేనత్తువ వాటికి ఉండదు. క్రొత్తదనం సత్తువతో నిలవాలంటే సరిక్రొత్తదర్శనం కవితకు కావాలి. దాన్ని మౌలికమయిన ప్రతిభతో అవిష్కరించే కవిశక్తి కావాలి. భావనలో, అభివ్యక్తిలో ఒక నవ్యస్ఫూర్తి భాసించాలి. ఇంత జరిగినా దర్శనం పాక్షికంగా, నైమిత్తికంగా ఉండకూడదు. శాశ్వతాలూ, విశ్వజనీనాలూ అయిన సత్యాలను అన్వేషించే అనంత మార్గాలకు ఆకర్షకంగా ఉండాలి. నవ్యత సాహిత్యానికి జీవనాడియైతే, దర్శనం సాహిత్యానికి జీవశక్తి!

విప్లవ కవిత్వందాకా వచ్చిన అధునికాంధ్ర సాహిత్యం సరిక్రొత్త నవ్యతను అందించే దర్శనం కోసం ఆరాటపడుతోంది. ఆ దర్శనం మార్క్సిస్టు దృక్పథం కంటె విలక్షణంగానూ, విశ్వజనీనంగానూ, సామాజిక స్పృహతో కూడుకొన్న సౌందర్యదర్శనం గానూ ఉండాలని సాహిత్యలోకం ప్రతీక్షిస్తున్నది. బాపురెడ్డిగారు 'అనంత సత్యాలు' కావ్యంద్వారా అందించిన 'భావభౌతికవాదం' ఆధునికాంధ్ర సాహిత్యాని కొక వెలుగుబాటలా ఉన్మీలిస్తుందనటంలో అనుమానం లేదు.

నేడు ప్రచురంగా సాహిత్యాన్ని శాసిస్తున్నది గతితార్కిక భౌతికవాద మూలమైన మార్క్సిస్టు దృక్పథం. "Marxist dialectical materialism is the

form of matarialism which explains social institutions and historical changes in terms of material forces, that is, the mode of production which characterizes economic system of a society'. (D.W.L.T) ఈ దృక్పథంతో వెలువడే సాహిత్యానికి సామాజికస్పృహ అంటే రాజకీయవేత్తల్లో, సాహిత్యవేత్తల్లో భిన్నమయిన అవగాహన కనపడుతుంది. దీన్ని వివరిస్తూ శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగారిలా వివేచించారు. ''రచన చెయ్యడం ద్వారా రచయిత సామాజికుడు గానే ఒకపాత్ర నిర్వహిస్తున్నాడు. సమాజంనుంచి పొందిన జీవితానుభూతిని రచనలో పునస్సృష్టిస్తున్నాడు. సాహిత్యం అనుకరణ కాదు. సృష్టి. అనుభూతి రచయితలో మథింప బడుతున్నంతవరకు ఆత్మాశ్రయమే. భాషతో విశిష్టమయిన రూపాన్ని పొందగానే అది ప్రత్యేకమయిన వస్తువుగా, సజీవ శిల్పంగా అస్తిత్వం పొందుతుంది. సృజనాత్మక రచన వస్త్వాశ్రయం కాదు. ఒక ప్రత్యేకమయిన వస్తువు. సామాజికులకు అందుబాటులో ఉండే వస్తువు. ఎంత మంది కని ప్రశ్నకాదు. సమాజమే దాన్ని గూర్చి తీర్పు యిస్తుంది. రాజకీయవాదికి ఒక్కనికే ఆ అధికారం దత్తం కాలేదు. మార్క్స్ అలా దత్తం చేయలేదు. కాలంలో కరడుకట్టిపోయే చారిత్రక బంధాల నుంచి మనిషికి వియుక్తి కలిగించే చైతన్య స్ఫురణ, ప్రేరణ, స్పృహ, సృజనాత్మక రచనలో వ్యంగ్యంగా అభివ్యక్తమయితే, దాన్ని 'సాహిత్యంలో సామాజిక స్పృహ'గా గుర్తించడమవుతుంది. యిది రాజకీయవాది ఊహకన్నా అభిప్రాయంకన్న విస్తృతమయినదీ సున్నితమయినదీ, బహురూప సమన్వితమయినదీ, బంధవిముక్తీ, సామాజిక పురోగతీ రాజకీయ చర్యద్వారానే జరుగునని అనేవాడు రాజకీయవాది. అతనికి రచయిత తత్వమూ సాహిత్య తత్వమూ అవగాహనకు రావు'' (సమాలోచనం, పు.4 5). సమకాలీ నాంధ్రకవులలో చాలా మంది సామాజిక స్పృహను మన్నిస్తున్నారు. కాని, దానికి రాజకీయవాదాలనుండి విముక్తి కలిగించాలని కొందరు యత్నిస్తున్నారు. సామాజిక స్పృహతో కవియే నాయకుడూ సాహిత్యరంగాన్ని రూపొందించాలనే సాహిత్యస్పృహ కవిత్వంలో రావాలని ప్రయోగాలు చేస్తున్నారు. రాజకీయమే జీవిత సర్వస్వం కాదనీ, మానవుని సర్వజీవ ప్రవృత్తులనూ, సామాజిక చైతన్యాన్నీ తీర్చిదిద్దే శక్తులు మరెన్నో ఉన్నాయనీ, వాటినన్నింటినీ జాగృతంచేసి, ప్రగతి పథంలో పయనింపచేసే అభ్యుదయాన్ని సాహిత్యం దర్శించి ప్రపంచించాలనే గాఢంగా భావిస్తున్నారు. ఈ చైతన్యం నవ్యత కొక నవీన మార్గం.

ఈ నవీన మార్గం ఇపుడు ఉషఃకాంతులను ప్రసరిస్తున్నది. ఇందులో రాజకీయ నాయకత్వం నుండి సామాజికస్పృహను విముక్తి కలిగించి, దానికి

విశ్వజనీనమైన కళాస్వభావాన్ని అలవరచాలన్న ఉద్యమోత్సాహం కనబడుతున్నదే కాని, భావి సాహిత్యాన్ని ఒక నిర్దిష్టమార్గంలోనడిపింప గలిగే నిర్దుష్ట దర్శనం ఇంకా అరుణోదయస్ఫూర్తితో ఉదయించవలసివుంది.దీనికి కొందరు కవులు తెలుగులో కృషి చేస్తున్నారు. కవిసేనలాంటి వారు దీనికి ఉదాహరణం. ఈప్రయత్నం వారితోనే ఆగలేదు. వ్యక్తిత్వంఉన్నకవులు వైయక్తికంగా వేరువేరుదర్శనాలతో ఆ వివుక్తి మార్గాన్ని అవిష్కరిస్తున్నారు. అలా ముందుకు వస్తున్న అభ్యుదయకవుల్లో శ్రీ బాపురెడ్డిగారొకరు. వారి 'భావభౌతికవాదం' సరి క్రొత్త స్వేచ్ఛావాదం!

శ్రీ బాపురెడ్డి సహజంగా అనుభూతివాదియైన భావుకుడు. ఆలోచనను అనుభవంగా వ్యక్తీకరించటమే కవిత్వమనే తత్త్వాన్ని కవితగా రూపొందించటమే ఆయన ప్రయోగం. ఆధునికాంధ్రకవితలో అనుభూతి సన్నగిల్లుతూ ఆలోచన అనుకరణరూపంగా పరిణమిస్తున్న పరిస్థితి నాయన గుర్తించి పరితపిస్తారు. ఆలోచనకు అనుభవం పునాది. అనుభవం నుండి ఆలోచన ఉదయిస్తే అది విత్తునుండి మొక్క పుట్టినట్లుగా సహజపరిణామసుందరంగా వుంటుంది. ఆలోచనతో అనుభవాన్ని అన్వేషిస్తే అనుకున్నది కనబడుతుంది. కాని, అసలుతత్త్వం అవగాహన కాదు. అనుభవం ఆత్మీయమైంది . ఆలోచన అనుభవోద్భవమైతే స్వీయానుభవ స్ఫూర్తితో వస్తుదర్శనం లభిస్తుంది. స్వీయానుభవం విశ్వజనీనంగా మార్చుకొనగలిగే సంస్కారం సాహిత్యోపాసకుని కుండాలి. సౌందర్యోపాసన, లలితసంస్కారాన్ని కలిగిస్తుంది. దాన్ని, కాలానికీ, పరిసరానికీ మించిన విశ్వవాతావరణంలోకి ప్రసరింపజేసేది తత్త్వం. సౌందర్యానికి తత్త్వం పూవుకు తావి లాంటిది. సౌందర్యంలో తత్త్వం పరీమళంగా ప్రసరించాలి. సౌందర్యానికి ప్రతీకయైన పుష్పం భౌతికం; అది అందించే సౌగంధ్యం భావనామయం. ఒకటి సగుణం మరొకటి నిర్గుణం. భౌతికవాస్తవం పుష్పమైతే, అందులోని సౌందర్యం భౌతికసత్యం. ఇది ఇంద్రియాలద్వారా మనస్సునకు అనుభవాన్నిచ్చే సత్యం. ఆ సత్యంలో భావనామయ మైన అనుభూతినిచ్చే సౌగంధ్యం కవితాతత్త్వదర్శనం. ఇదే కవితలో వస్తుతత్త్వంగా వ్యంగ్యమవుతుంది. కవిత పుష్పం: సౌందర్యం అనుభవం: ఆలోచన తత్త్వం. ఈమూడూ కవితా సత్యాలే, విడదీయలేని త్రివేణి సంగమం; విశ్లేషించలేని త్రిపుటి. ఈ మూడింటిని ఈక్రమంలోఆవిష్కరించటమే కవితాభివ్యక్తిగా బాపురెడ్డిగారి దర్శనం.

సమకాలీన సాహిత్యజగత్తులో ఈ ప్రస్థానం వ్యత్యస్తంగా కనబడుతుంది. కొందరి దృష్టిలో ముందు సిద్ధాంతం, అది చూచినదే సత్యం. ఆ సత్యంలో సౌందర్యంకాదు ముఖ్యం సిద్ధాంతతత్త్వం. అంటే నీవనుకున్న సుగంధాన్నిచ్చేదే

పుష్పం. ఆ పుష్పం ఆ సుగంధాన్నివ్వడమే వాస్తవం. ఇలా దర్శించటమే తత్త్వం. అదే సత్యం. ఈ విపరీత ప్రస్థానానికి విరుగుడు మార్గమే బాపురెడ్డి కవితా ప్రస్థానం.

ఆధునిక మానవుడు పదార్థవిజ్ఞానం వల్ల భౌతిక వస్తువిశ్లేషణాన్ని చేసి వివేకాన్ని సాధిస్తున్నాడు. దాన్ని శాస్త్రదృష్టితో తర్కబద్ధం చేస్తున్నాడు. ప్రయోగ ముఖంగా సాగే పదార్థవిజ్ఞానం అతనికి వస్తువు యొక్క యధార్థ స్థితిని వివరిస్తున్నదే కాని దాని పరమార్థాన్ని పట్టిచూపడంలేదు. ఈ దృష్టితో మనిషి మానవ జీవితాన్ని కూడా విశ్లేషిస్తున్నాడు. వివేచన కందించే వాస్తవ మంటున్నాడు. ఆ వాస్తవం ప్రతీదీ ప్రయోగపరిజ్ఞానంతో పరిష్కరించే అవకాశం వుండటం చేత దాన్ని శాశ్వతంగా గ్రహించలేకపోతున్నాడు. అయితే, సత్యాన్వేషణదృష్టికి శాస్త్రదృష్టి ప్రధానమని ప్రామాణికంగా భావిస్తున్నాడు. శాస్త్రదృష్టివల్ల పొందే విజ్ఞానం వివేచనకు పనికివచ్చినంతగా వ్యక్తివికాసానికి తోడ్పడటం లేదు. చంద్రమండలాన్ని చుంబించినా మనిషిలోని జంతుభావం చావడంలేదు. జంతువు మనిషి కావడం జరిగితే మనీషిగా మారినా ఒక సార్థక్యం వుంటుంది. మనీషిగా మనిషిని మలుస్తున్న పదార్థవిజ్ఞానం మౌలికంగా మనిషిని మనీషిగా మార్చడంలేదు. అందువల్ల మానవజాతిలో మానవత్వ లక్షణాలను పునరుద్ధరించవలసిన అవసరం ఏర్పడుతుంది. పదార్థవిజ్ఞానం అర్థబలం, అంగబలం ఎంతవున్నా హృదయబలం ఆత్మబలం నేటిసమాజానికి కరువైపోతున్నాయి. సాహిత్యంకొరవడుతున్న ఈ మానవశక్తుల్ని మేల్కొల్పాలి; పోషించాలి; ప్రబోధించాలి; అనుభవింపజేయాలి.

''ఆత్మజ్ఞానానికి
ఆవలిగట్టు దేవుడు
పదార్థజ్ఞానానికి
ఆఖరిమెట్టు అనం తత్వం
అంతర్ముఖంగా
యోగమార్గం
అన్వేషిస్తున్నది దైవత్వాన్ని
బహిర్ముఖంగా
ప్రయోగమార్గం
శోధిస్తున్నది అనంతత్వాన్ని;
రెండుమార్గాల సంగమం
నామనోమండలం''

(అనంత సత్యాలు)

అన్న బాపురెడ్డి ప్రతిపాదన వ్యక్తిగతం మాత్రమేకాదు, సమకాలీన సమాజం అంతరుర్ముఖంగా పడుతున్న ఆవేదన. ఆత్మజ్ఞానం + పదార్థజ్ఞానం = సాహిత్యదర్శనం; దైవత్వం + అనంతత్వం = సాహిత్యతత్త్వం, అన్నది బాపురెడ్డి భావభౌతిక పదానికి మూలసూత్రం. ఇందులోని భావం మానవుడు జీవిత తత్త్వాన్ని గురించి సాగించే ప్రస్థానానికి ప్రతినిధి. అనంతత్వం హేతువాద శాస్త్రదృష్టితో సృష్టిని సమీక్షించే ప్రయోగమార్గానికి ప్రతీక. ఈ రెండింటియొక్క మిశ్రరూపం మానవజీవితానికి సాహిత్యమందించే సరస సందర్శనం. దీనివలన కలిగేది ఆనందబ్రహ్మానుభూతి.

''భావవాద
భౌతికవాద
సరస సమ్మేళనంలో
ఆనంద బ్రహ్మను దర్శిద్దాం:''

అంటాడు శ్రీ బాపురెడ్డి. దైవత్వం మానవుడు అందుకొన దలిచిన పరిపూర్ణత్వానికి ప్రతీక; అనంతత్వం ప్రకృతిలో పదార్థసత్యాన్ని అన్వేషించాలన్న ప్రయోగదర్శనానికి ఫలత్వం. భౌతికం పరిపూర్ణత్వ భావనతో సంవదించినప్పుడు అనుభూతమయ్యేది ఆనందమనే అనంత సత్యం. ఇది సాహిత్యమార్గాన్ని అనుసరించి అనుశీలించి అనుభవించే ప్రవృత్తి కవితాసృష్టి.

బాపురెడ్డిగారు 'ఆనందబ్రహ్మను దర్శిద్దా' మన్నప్పుడు పరమ ఛాందసుడా అనిపించవచ్చు. నిజాని కాయన కాడు. భౌతికదృష్టిని భావదర్శనంగా మార్చి సాహిత్య ప్రస్థానంగా సమున్మీలింపచేసే సౌందర్య శాస్త్రదృష్టి ఆయనది. ఆయన ప్రతిపాదిస్తున్న భావ భౌతికవాదం విశ్వజనీన సౌందర్యదర్శనం (Universal Easthetic vision)గా కనిపిస్తుంది. సౌందర్య దర్శనంలో సత్యం ప్రాతిభాసికమనీ, అలౌకికమనీ ప్రాచ్యలాక్షణికులు పారిభాషికంగా ప్రతిపాదించారు. దాన్ని లౌకిక సత్యం కంటే భిన్నమైన సాహిత్య సత్యంగా, కళాసత్యంగా పాశ్చాత్య విమర్శకులు వివేచించారు. సర్వానుభవాలకూ ఇంద్రియాలెంత ప్రమాణమో, అంతరంగం కూడా అంతముఖ్యం. తర్కాన్ని ఆశ్రయించి బుద్ధి నడిచినా, ప్రయోగ విజ్ఞానాన్ని నమ్మి ఇంద్రియాలు వర్తించినా అవన్నీ అనుభవ బిందువులో ఆర్ద్రమయి అనుభవ స్ఫూర్తిని పొందాలంటే ఆనందమనే అగ్ని కావాలి. కరుడుకట్టిన విజ్ఞానం ఆనందాగ్నితో కరిగి అనుభవాకృతి తాల్చినపుడే మనిషి సహృదయుడుగా మారేది. అలా మారిన సహృదయునిలో ప్రవృత్తిత్రయం ప్రదర్శితమౌతుంది. వాటిని వివేచిస్తే, దార్శనిక ప్రవృత్తి; వాస్తవిక ప్రవృత్తి; అనుభవ ప్రవృత్తి అని చెప్పుకోవచ్చు.

ఈ మూడింటి సమగ్రవికాసమే మానవ పరిపూర్ణ వ్యక్తిత్వవికాసం. ఈ మూడింటిలో ఏ ఒక్కదానినో సత్యమని నమ్మి, మిగిలిన వాటిని త్రోసిరాజంటే అది సమగ్రదర్శనం కాదు. బాపురెడ్డిగారి భావభౌతికవాదం సహృదయ దృక్పథంతో సత్యాన్వేషణ, సత్యనిరూపణం, సత్యానుభవం సాధించే సమన్వయ మార్గాన్ని ప్రతిపాదించింది.

''మనకు కనిపించేది
సత్యం కాదని
మాయావాది వాదం;
మరి మనకు కనపించనిది
సత్యం ఎలా అవుతుందని
హేతువాది ప్రశ్న
సమయసత్యాలేకాని
శాశ్వత సత్యాలు లేవు
మనం ఒక సత్యం
మాయకూడా ఒక సత్యం
ఏదీ సత్యం కానప్పుడు
అన్నీ సత్యాలే అవుతాయి''

అన్న వాదం బాపురెడ్డి ప్రతిపాదన ప్రజ్ఞను ప్రకటిస్తున్నది. ఈ వాదం 'ఏకం సత్' అని చెప్పే వేదాంతం కాదు; ప్రత్యక్షప్రమాణం కోరే హేతువాదం కాదు; . భావసత్యాలుగా భావించి అనుభవించే సాహిత్య సహృదయవాదం . పై రెండు వాదాలూ సాహిత్య క్షేత్రంలో సత్యాన్వేషణకు పనికిరావని, సాహిత్య దృక్పథంలో పదార్థమొకటయినా, అందులో ప్రతిభాచక్షువుకు కనబడే సత్యాలనంతాలనీ, సౌందర్య దర్శనాని కందే పరమార్థం కవితాత్మయైన రసబ్రహ్మమనీ బాపురెడ్డిగారి వాద తాత్పర్యం.

కల్పితం శాశ్వతం కావటం భౌతికధర్మం కాదు. కాని, సాహిత్యంలో అపూర్వ నిర్మాణక్షమ మైన ప్రతిభాశక్తితో కవి తన కావ్యంలో దర్శించి, ఆనంద స్పర్శనందించేటట్లు ఆవిష్కరించి అందించిన సౌందర్యసత్య సృష్టి అంతా కల్పితమైనా శాశ్వతంగా, విశ్వజనీనంగా భాసిస్తున్నది.

''కళ్ళు కల్పిస్తాయి సత్యాన్ని
బుద్ధికల్పిస్తుంది సత్యాన్ని

అవసరం కల్పిస్తుంది సత్యాన్ని
అందుకే
ఒకే వస్తువులో
రకరకాల సత్యాలు
సత్యాలన్నీ కల్పితాలే
సత్యాలన్నీ శాశ్వతాలే''

అన్న బాపురెడ్డి వాక్యాలు వారిసిద్ధాంతానికి వ్యాఖ్యానాలు. కల్పిత సత్యం శాశ్వతం అన్నది భౌతికంగా విరోధాభాసం. అలాగే అనిపిస్తుంది భావభౌతికవాదం. కాని, సాహిత్య దర్శనంలో అది సార్థకం; సమన్వయ సుందరం .

''మనిషి జీవితం
ఒక మాహాకావ్యం
జీవితం ఒక నిత్యసత్యం
అయినా అది మహాస్వప్నం''

జీవితాన్ని చీల్చి చూపేది శాస్త్రం; జీవితాన్ని మిథ్యగా భావించి త్రోసి వేసేది వేదాంతం.నిత్యసత్యాన్ని భౌతికంగా చూచి, భావలోకంలో మహాస్వప్నంగా అనుభూతి నిచ్చేది సాహిత్యం. శాస్త్రం భౌతికానంద మిచ్చినా మానసిక వేదనను సృష్టించింది; వేదాంతం జీవితాన్ని గూర్చి రాద్ధాంతం చేసి నిర్వేదాన్ని కలిగించింది; నేటి సమాజంలో వేదన నాగరకతకు లక్షణమైతే, నిర్వేదం జీవితానికి ఫలమివ్వలేని నిరర్థక ప్రస్థానమై పోయింది. ఈ రెంటికీ ఉజ్జీవనం కలిగే ఉజ్జ్వలమార్గం సాహిత్యం చూపిస్తే మానవుని సహజానందాన్వేషణం సఫలమవుతుంది.

''దేహం ఆనందాన్వేషి
మనస్సు ఆనంద పిపాసి
బుద్ధి ఆనందోపాసి
త్రివిధానందసమాధి
జీవిత పరమావధి''

గతి తార్కిక భౌతికవాదం మానవుని ఆర్థికాభ్యుదయాన్ని అందించే ఆనందాన్ని కల్పించాలని యత్నిస్తోంది. సమ సమాజ నిర్మాణ ధ్యేయంతో పురోగమిస్తోంది.ఆర్థికంగా సమానత్వాన్ని సాధించిన మానవలోకం హార్దికంగా

విశ్వమానవ సమానత్వం సాధించే సంస్కారాన్ని భావయోగంద్వారా సంపాదించాలి. మనిషిని మనిషిగా భావించే సహృదయత జనంలో సమున్మీలించాలి. అయినా, అహంకార స్వార్థాభిమానాలు మనిషిని మనిషితో ఐక్యం చేయలేక పోతున్నాయి. వాటిని చంపుకున్నప్పుడే మనిషిలో మమత ఉదిస్తుంది; ప్రేమ పెల్లుబకుతుంది. ప్రేమతో మనిషి లోకాన్ని చూస్తే ప్రతివ్యక్తిలో దైవత్వం స్ఫురిస్తుంది. ఆ దైవత్వాన్ని ఆధ్యాత్మికంగా అందుకుంటే ఆత్మజ్ఞాన్ని అవుతాడు; సాహిత్యం ద్వారా సాధిస్తే రసయోగి అవుతాడు. సామాజిక స్పృహకు రసయోగం వల్ల సార్వజనీనత లభిస్తుంది; రాజకీయంనుండి విముక్తి సిద్ధిస్తుంది. తాత్త్వికచింతనకు రసయోగంవల్ల సహృదయత సమకూరుతుంది; మిథ్యావాదంనుండి సౌందర్య దర్శనం పొటమరిస్తుంది. భౌతికంగా సాధింపదలచుకున్న సర్వమానవసమానత్వానికి భావలోకంలో భద్రతను కల్పించేది, భావలోకంలో భద్రంగా నిలిచే విశ్వజనీన దృక్పథానికి శాశ్వతత్త్వాన్ని సమకూర్చేదీ బాపురెడ్డి గారి భావభౌతికవాదం. అందుకే తన ప్రస్థానాన్ని మనిషినుంచి ప్రారంభించారు బాపురెడ్డిగారు. జీవితాన్ని ఒక మహాకావ్యంగా దర్శించారు;

''జీవితం
జననమరణాల మధ్య
కాలం వ్రేలాడగట్టిన
కాంతిరేఖ''

అని జీవన గీత వినిపించారు. 'మావూరినుండి బయలుదేరి, మానవ లోకమంతా స్పర్శిద్దాం'' అని విశ్వజనీనతను ప్రకటించారు: ''మావూరును మీ ఊరిలో దర్శిద్దామని'' అద్వైతాన్ని ప్రదర్శించారు. వీరి కవితా ప్రస్థానానికి కరదీపిక ''అనంతసత్యాలు'' కావ్యం.

మార్క్సిస్టు దృక్పథంతోనే చూచింది భౌతిక సత్యం, ఆలోచించింది భావసత్యం; సృష్టించింది కవితాసత్యం అన్న ఏకైక సత్యాన్ని దర్శించే ఆధునికాంధ్ర కవిత్వ ప్రస్థానానికి, రాజకీయశృంఖలాలను త్రెంచివేసి, అఖండ సంస్కారధారగా కవిలో పొంగే స్వేచ్ఛాదర్శన స్వాతంత్ర్యాన్ని దర్శించి, కవతాత్మయైన రసానుభవాన్ని హృదయభాండాల్లో నింపించి, సాహిత్యప్రస్థానం అనంత సత్యాన్వేషణ ప్రవృత్తితో సౌందర్యదృక్పథంతో సాగించే సహృదయ నిత్యసత్య సృజనా సరస్వతీ ప్రవాహమని ఎలుగెత్తి చాటుతున్నారు శ్రీ బాపురెడ్డి. బాపురెడ్డి కోరేది కవితకు భారమైన రాజకీయ ప్రభావ శృంఖలాల విముక్తితో పాటు భావభౌతికవాద ప్రసక్తి.

''పరిణామానికి పాట నేను
భవిష్యత్తుకు బాట నేను
జననానికి మరణానికి మధ్య
జీవితాన్ని నేను
కాలప్రవాహ ప్లవాన్ని నేను
క్రమవికాస విప్లవాన్ని నేను
రండి నాతో రండి''

మరో మహాప్రస్థానాన్ని సాగించే మహాకవిలా పిలుస్తున్నాడు శ్రీ బాపురెడ్డి. తన భావభౌతికవాదం సాహిత్య సామ్యవాద మంటున్నాడు. వినండి ఈకొత్తపోలికేక:

''సామ్యవాదిని
అందరిలో అన్నిటిలోని సామ్యాలను కలిపే
సాహిత్య సామ్యవాదిని''
సాహిత్య స్వామ్యవేదిని.''



"Life
a string of light
suspended by Time
betwixt birth and death;
birth -
an alluring secret;
death -
an awful mystery."

**- J. Bapu Reddy.**

# అల్లరి నీటి అలలు

- జె. బాపురెడ్డి.

కడలి గుండె మీదికి ప్రాకి
అల్లరిచేసే అలల బాలలు
కోరుతున్న గొంతెమ్మకోరికలేమిటో
అంతులేని మహాశక్తిసాగరుడు
ప్రసాదించలేని వరాలేమిటో!
అడిగీ అడిగీ ఏడ్చీ ఏడ్చీ
అలసిపోయిన అమాయికోర్మికలు
నురుగులు గ్రక్కుతూ వ్రాలిపోతున్నాయి.
పుడమితల్లి పరిచిన
ఇసుక పొత్తిళ్లమీద
సైకతాలమీద పొరలి పొరలి
ఒంటికి అంటిన మట్టిని
కడుక్కోవడానికి
మళ్లీ తెల్లచొక్కాలు తొడుక్కోవడానికి
జలధిలోకి దూరిపోతున్నాయి
అల్లరినీటి అలలు
నిజాలు తెలియని కలలు -
నీటిలోపుట్టి నేలగట్టుకు చేరుతూ
నేలను ముట్టి నీరధిలోనికి జారుతూ
ఆడుకొనే ఆటపేరే జీవితమా ?
పాడుకొనే పాటపేరే పరమార్థమా ?
కడలి లోతులు చేరుకోలేని అలలు
పుడమిమీద నిలిచిపోలేని తరగలు
అటూ ఇటూ వూగడమేనా !
ఎటూ కాని
దేశకాల భ్రిమ్మరులేనా!



# Dr. SANJIVA DEV - A PHENOMENON

**J. GANDHIJI**

The Snow
On the Blooms
The flow
Of the connoisseur's dictions
The Wonder
Of the Clouds
The clouds
Of the Dust
The Aroma
Of the Rose Flower
Found Joy
In you - Sanjiva Dev
You are a Lustre Poet
A Magnificent Writer
A Superb Orator
An excellent Artist
In you
The Patriot
The Polylinguist
The Scholar
Your Art and Literature
and your service to Culture
Your creative intelligence
Are ominous Properties
Your Prose is semantic
Your Poetry is semi-semantic
And Dogma
Mainstream of

Reader and Writer
Your Birth
A Ray of Sunshine
Pink of all faculties
Perfunctory glance
A Shining Chapter
Your Association with
Rabindranath Tagore
An intellectual Achievement
Your Life Ideal
Thy Style a Model
And metaphorically hidden
Your Camera of Eyes catch
Scenic splendours
Your enchanting Eyes
Click Species
Birds, Nests
and Poverty Huts
You are genius in Calligrapic Art
It glimpses Rainbow
Your Landscapes - Mirror
Of Saffron Himalaya
Your Letter - writing
An exotic perfume to Life
You have a new dimension for Life
Life is short
Art is Long
Prose is the Earth
Poetry is the Cloud
Music is the Iris
Your Dwelling Rasa- Rekha

A veritable Centre
For Art and culture
Your Ethical views
Are Model Examples
Your Works
A Vintage
Your era
A golden Chapter

(COURTESY; READERS OF DR. SANJIVA DEV WORKS IN INDIA AND ABROAD)



## కొండమీది దీపం

- సంజీవ దేవ్

వెలుగు తూంది కొండ మీద దీపం
మెరుస్తూంది బండ మీద రూపం
మండుతూంది గుండెలోన తాపం
అరుస్తూంది ఎండలోన తొండ
పొంగుతూంది లండన్‌లో థేమ్స్
స్వీడన్‌లో కురుస్తూంది మంచు
ఎందుకనో ఎందుకనో
తెలియదు మరి తెలియదు
ఎందుకనో తెలియదు తమకే తమ సంగతి ;
తెలిసినా తెలపవు మనకవి
తెలిపినా తెలియదు మనకు
వాటి మౌన భాష ;
ఎవరికి తెలిసినా తెలియకున్నా
కొండ మీద దీపం వెలుగుతూనే వుంది
బండ మీద రూపం మెరుస్తూనే వుంది.

# ప్రాణం విడచింది కుక్క

- సంజీవదేవ్

నేను క్రిందికి చూచినపుడు
అదిచూచేది పైకి
నా తడచిన కళ్లలోకి,
మళ్లీ వెంటనే మూసేది కళ్లు;
బయట వేడి అని
చెట్టునీడలో వుంచాను దాన్ని
కాని రాలేదు చల్లదనం,
నీడలోచలి అని
తీసుకుపోయాను ఎండలోకి
నీడా ఎండాలేని తావును వెదకేను
దాన్ని వుంచడానికి
కాని లేకపోయింది
అటువంటి తావు;
మందువేళకు ముందే
మందు సిద్ధంగావుంచేవాడిని
గట్టిమందు మ్రింగనపుడు
ద్రవమైన మందు,
అదికూడా మ్రింగనపుడు
సూది మందు.
తోడుగా వుంటాయని
తెచ్చాను
ఒక పెద్ద కుక్కనూ
రెండు పిల్ల కుక్కలనూ
కాని అది చూడనేలేదు వాటివైపు
కళ్లు మూతపడితే
తనను చూచుకోటం
తెరిపిడి పడితే

నన్ను చూడటం.
నన్ను చూచినపుడల్లా
నిరాశతో
నిస్పృహతో
సగం మూసిన
కన్నులతో
అస్పష్టంగా
కన్నీటి పొరలగుండా
అదే ఆఖరిచూపన్నట్లు
చూచేది నావైపు;
కాని ఆ వెన్నెల రాత్రి వరకూ
దాని ఏచూపూ
కాలేదు ఆఖరి చూపు.
అదే ఆఖరి చూపు అని
అదీ భ్రమించేది
నేనూ భ్రమించేవాణ్ణి
కాని తరువాత
మరోచూపువచ్చి
ఆ క్రిందటి చూపును
కాపాడేది
ఆఖరిచూపు కాకుండా.
రొట్టెముక్కను చూపితే
కష్టంతో నోరు తెరచేది
అయిష్టాన్ని చూపుతూ
కాని పెదవికి అది తగలగానే
మూత పడేది నోరు;
కోరికకున్న బలం
లేకుండా పోయింది
నోటికి
నోటిలోని గాయం
నొప్పిచేసినపుడల్లా

పెద్దశబ్దంలేని
చిన్న మూలుగు
మూలిగేది,
అది
ఆసావేరి రాగంగా
దూర తీరాలనుంచి
సుదూర గిరులకు పయనిస్తున్నట్లు
అంతులేని లోతులనుంచి
అనంత శిఖరాలకు ఎక్కుతున్నట్లు
వినిపించేది
అదే ఈ మర్త్యలోకంలో
దాని అంతిమ గీతం
నీరవ మృత్యు సంగీతం



నునుమబ్బు లేదున్న కొనలపై సోనలా
నెలవంక చిఱునవ్వు చలువపాట,
తొలిప్రొద్దు పొదుపు రేకుల పైడిదారుల
ఏరులో మంచు కన్నీరు పాట,
పావురాయుయ్యాల పక్షాల యంచుల
జాలులో గాలి నీలాల పాట,
విరజాజి కన్నె నిద్దుర కన్ను రెప్పల
కాల్వలో నెత్తావి కలలపాట,
కలిసి, నీ గొంతు త్రోవల సెలలు గట్టి,
అలల నుప్పొంగి, నా హృదయాంచలముల
బారి, దాహోన బీటలు వారి యెండు
ఈ బ్రతుకు నిండ నిండిపోయినవి, చెలియ.

(కృష్ణశాస్త్రి)

'కవితాప్రావీణ్య ఫణీంద్ర'
'రమ్య సుగుణ సాంద్ర'

# వంకలపాటి రామచంద్ర

- తంగిరాల సుబ్బారావు
- ఎల్.బి. శంకరరావు

## 1. ''గాలిని చూశావా?''

సుమారు 50 ఏళ్ల క్రిందట జరిగిన వింత సంఘటన. అది చిత్తూరు జిల్లాలో ఒక కుగ్రామం. పేరు 'నేలటూరు' అక్కడి ప్రాథమిక పాఠశాలను పరీక్షించడానికి స్కూళ్ల ఇన్స్పెక్టర్ కృష్ణమనాయుడు గారు వచ్చారు. పిల్లలూ, ఉపాధ్యాయులూ అందరు హడలిపోతున్నారు. ఇన్స్పెక్టర్ గారు సరాసరి ఐదవ తరగతి గదిలో అడుగుపెట్టారు. అందరూ లేచి నిల్చున్నారు. 'కూర్చోండి' అని పిల్లల్ని కూర్చోబెట్టి, ''మీలో ఎవరైనా గాలిని చూశారా?'' అని ప్రశ్నించారు? కృష్ణమ నాయుడు గారు. పిల్లలంతా తెల్ల మొహాలు వేశారు. కాని వారిలో ఒక కుర్రాడు మాత్రం లేచి నిలబడ్డాడు. ఇన్స్పెక్టర్ గారు ఆ కుర్రాడివైపు చూసి ''గాలి ఉందా? ''అని మళ్లీ ప్రశ్నించారు.

''ఉంది'' విద్యార్థి ధైర్యంగా సమాధానం చెప్పాడు.

''నువ్వు చూశావా?'' అని రెట్టించాడు ఇన్స్పెక్టర్

''చూడలేదు కాని ఉంది!''అని స్థిరంగా జవాబు చెప్పాడు విద్యార్థి.

''చూడలేదు అంటున్నావు. తిరిగి నువ్వే ఉందంటున్నావు. ఏమిటిది?''అని దబాయించాడు ఇన్స్పెక్టర్. పిల్లలంతా గొల్లున నవ్వారు. అయినా ఆ విద్యార్థి ఏమీ తొణకలేదు, బెణకలేదు.

''గాలి ఉంది?''అన్నాడు మళ్లీ.

''ఎలా చెప్పగలవు?''అని అడిగాడు కృష్ణమనాయుడుగారు కుతూహలంగా.

వెంటనే ఆ విద్యార్థి గబగబా ఇన్స్పెక్టర్ దగ్గరకు వెళ్లి , ఆయన చేయి పట్టుకుని, దానిపై ''ఉఫ్''అని తన నోటితో వూది , ''గాలి ఉందా? లేదా?'' అని ఆ ఇన్స్పెక్టర్‌కే ఎదురుప్రశ్నవేశాడు. పిల్లలంతా మళ్లీ గొల్లుమన్నారు. ఇన్స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. ఆ విద్యార్థి తెలివితేటల్ని, చురుకుతనాన్ని, ధైర్యాన్ని

ప్రశంసించకుండా ఉండలేకపోయాడు. అలనాటి ఆ పల్లెటూరి ఎలిమెంటరీ స్కూలు విద్యార్థి, ఈనాటి మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖాధిపతిగా ఉన్న ఆచార్య వంకలపాటి రామచంద్రచౌదరిగారు. సంప్రదాయ సాహిత్యంలో నిష్ణాతుడు, డొక్కశుద్ధి కలిగినవాడు అయిన ఈ వి. రామచంద్రగారు అందరికీ తెలుగు ప్రొఫెసర్‌గా మాత్రమే పరిచయం. కాని ఈయన మంచికవి. ఉత్తమ భావుకుడు. ఈ రామచంద్రుడు 'కవితా ప్రావీణ్య ఫణీంద్రుడు' రమ్య సుగుణసాంద్రుడు,'... అంటూ కవిగా రామచంద్రగారిని పరిచయం చేయడానికి ఈ చిన్న వ్యాసం ప్రచురిస్తున్నాం.

**2. జననం-విద్యాభ్యాసం-ఉద్యోగాలు :**

ఆచార్య వంకలపాటి (వంకాయల పాటి) రామచంద్రచౌదరిగారు 1937 వ సంవత్సరంలో జూన్ 4వ తేదీన చిత్తూరు జిల్లా 'నేలటూరు' గ్రామంలో ఒక సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. వీరి తల్లి మునెమ్మ గారు, తండ్రి కొండమ నాయుడు గారు.

నేలటూరులో ప్రాథమిక విద్య ; ముత్యాలపేటలో ఉన్నతపాఠశాల విద్య, మద్రాసు పచ్చయ్యప్ప కళాశాలలో ఇంటర్ మీడియెట్ (డి. గ్రూపు - తెలుగు స్పెషల్ లిటరేచర్-బంగారు పతక గ్రహీత),1956-59 మధ్య కాలంలో విశాఖపట్టణంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ. ఆనర్స్ తెలుగు చదివారు. తరువాత 1960-64 మధ్యకాలంలో తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో "A Critical Study of Erra Praggada's Works" అనే అంశంపై ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పర్యవేక్షణలో పరిశోధన చేసి, ఇంగ్లీషు భాషలో సిద్ధాంత గ్రంథం వ్రాసి, పిహెచ్.డి. డిగ్రీ తీసుకున్నారు. తిరిగి 1964-67 మధ్య అక్కడే ''తిక్కన కవితా శిల్పం'' అనే అంశంపై Post-Doctoral Research కూడా చేశారు. విద్యాభ్యాసానంతరం వివిధ ప్రదేశాలలో రామచంద్రగారు చేసిన ఉద్యోగాల వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

1959-60 : చీరాలలోని V.R..S & Y.R.N. కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడు

1968-76 : అనంతపురంలోని S.V. University P.G. Centreలో ఆంధ్రోపన్యాసకుడు

1976-84 : మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరు.

1984 నుండి నేటి వరకు : మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ప్రొఫెసరు మరియు శాఖాధిపతి.

### 3. 'బూతుల బుంగన్న'కు దారిచూపిన వేదాచలం అయ్యవారు :-

'నేలటూరు'లో వేదాచలం అయ్యవారు అనే ఒక గొప్ప పండితుడు ఉండేవారు. ఆయన భజన కీర్తనలు అద్భుతంగా పాడేవారు. గురుకుల పద్ధతిలో విద్యార్థులకు చదువు చెప్పేవారు. రామచంద్రగారి అన్నగారు ఈ పండితుని దగ్గరనే ప్రాచీన పద్ధతిలో చదువుకున్నారు. మిక్కిలి చిన్నతనంలో రామచంద్రగారు వారి మేనమామల ఇంట్లో పెరిగారు. ఆ ఊరిపేరు 'అంగరం అగ్రహారం'. అక్కడ కొందరు తల్లులు బాల రామచంద్రునికి పాలిచ్చి పెంచారు. అక్కడ గ్రామీణులు మాత్రం ముచ్చటకోసం ఆ బాలునికి కొన్ని బూతులు నేర్పారు. అలా బూతు మాటలు నేర్చుకొని అల్లరి చిల్లరిగా తిరుగుతున్నాడు ఆ బాలరామచంద్రుడు. ఒకసారి వేదాచలం అయ్యవారు తన బంధువు నారాయణయ్యగారిని చూడటానికి అగరం అగ్రహారం వచ్చారు. అక్కడ మట్టిలో ఆడుకుంటున్న పసివాడు రామచంద్రను చూచి మందలించాడు. అది సహించలేక ఆ బాలుడు ఆయన్ని బూతులు తిట్టాడు. అయ్యవారు కుర్రాడి ముఖంలోకి చూచారు. ముఖంలో తేజస్సు వుంది. ప్రవర్తన చూస్తే ఇలా వుంది. 'ఎవడీ కుర్రాడు?' అని వాకబు చేస్తే, ఫలానా కొండమనాయుడి గారి పిల్లవాడని తెలిసింది. ఆయన తిరిగి నేలటూరు వచ్చిన వెంటనే కొండమనాయుడికి కబురు చేసి ''మీ అబ్బాయి అమ్మమ్మగారి ఊళ్లో ఉంటే పాడైపోతాడు. వెంటనే తీసుకుని వచ్చి ఈ ఊరిలో స్కూలులో వెయ్యండి'' అని ఆజ్ఞాపించాడు. ఆయన అలాగే చేశారు. స్కూలులో చేరినప్పటికీ రామచంద్ర రెండు మూడేళ్ళపాటు సరిగా చదవలేదు.

### 4. చచ్చినంత పని - జీవితంలో మలుపు:

బాల రామచంద్ర మూడవ తరగతి చదువుతూ ఉంటే కామెర్లు (పసిరికలు) వచ్చాయి. ఆ రోగాన్ని ఎవరూ గుర్తించలేకపోయారు. వారి అమ్మమ్మగారి ఊరు తీసుకొని వెళ్లారు. రోగం బాగా ముదిరి పోయింది. ఇక లాభం లేదనుకున్నారు. తిరిగి నేలటూరు తీసుకొని వచ్చారు. ఆ ఊరికి సమీపంలో కుశస్థలీనది ప్రవహిస్తోంది. ఆ నది ఒడ్డునే శ్మశానం. (ఈ నదిపై చక్కని కవిత వ్రాశారు. రామచంద్ర తరువాతి కాలంలో). అక్కడ ఈ బాలుడి కోసం గుంత కూడా త్రవ్వి సిద్ధం చేశారు. రోగం ముదిరిపోయిన బాలుణ్ణి పశువుల కొట్టంలో మంచంవేసి ఉంచారు. అందరూ ఏడుస్తున్నారు. చనిపోయాడని భావిస్తున్నారు. కాని బాలుని బొటన వ్రేలు కదలటం ఒక ముదుసలి గుర్తించింది. ఇంతలో వేదాచలం అయ్యవారికి ఈ విషయం తెలిసి పరుగెత్తుకొని వచ్చారు. బాలుణ్ణి పరిశీలించారు.

'పసిరికల రోగం' అని గుర్తించారు. చిత్తూరు జిల్లాలో ప్రసిద్ధికెక్కిన నాటువైద్యం (కుడిచేతి మణికట్టు మీద కాల్చడం) చేయించారు. పిల్లవాడు బ్రతికాడు. కొత్త జీవితాన్ని పుంజుకున్నాడు. వినయ విధేయతలు గల విద్యార్థిగా మారిపోయాడు. శ్రద్ధగా చదువుకుంటున్నాడు. మధ్య మధ్య వేదాచలం అయ్యవారు వచ్చి ఆ బాలుని చదువును పరీక్షిస్తున్నారు. కాలం ప్రవహిస్తోంది.

**5. వెలుగుబాటలో పయనం - ప్రాథమిక పాఠశాల :**

**యస్.మునిరత్నంగారి ప్రభావం:**

నేలటూరు ప్రాథమిక పాఠశాలలో యస్. మునిరత్నం అనే ఉపాధ్యాయుడు ఉండేవారు. ఆయన గొప్ప క్రమశిక్షణతో విద్య నేర్పేవారు. పిల్లలకు ప్రాచీన సాహిత్యంలో గట్టి పునాదులు వేసేవారు. నీతిశాస్త్రంలోని శ్లోకాలు, బాలరామాయణంలోని శ్లోకాలు, సుమతి శతకం పద్యాలు, కృష్ణ శతకం పద్యాలు, ఆంధ్ర నామసంగ్రహం, ఆంధ్రనామశేషం, నామలింగాను శాసనం - మొదలైన గ్రంథాలలోని పద్యాలు నిత్యం విద్యార్థులకు బోధించేవారు. ఆ పద్యాలు శ్లోకాలు కంఠస్థం చేయించేవారు. ప్రతి దినమూ ప్రతి విద్యార్థి ముందు క్రిందటి దినం చెప్పిన శ్లోకాలు పద్యాలు అప్పగించాలి. ఆ తరువాతనే రోజువారీ పాఠాలు జరిగేవి. ఆ ఉత్తమ ఉపాధ్యాయుని కృషి వల్ల రామచంద్రగారికి చిన్నతనంలోనే గట్టి సాహిత్యపు పునాది ఏర్పడింది. (ప్రాథమిక పాఠశాలలోనే ఇంత గొప్పగా పాఠాలు చెప్పే ఉపాధ్యాయులు ఈనాడు ఎక్కడున్నారు?)

యస్. మునిరత్నంగారితో పాటు వేంనవూరు పెద్దమ్మసాని మునిస్వామి నాయుడుగారు, రామచంద్ర అన్నగారు మునికృష్ణయ్యగారు రామచంద్రగారిలో సాహిత్యాభిరుచిని పెంచారు. తమ్ముడు ధనంజయ మూర్తి కవిత్వంలోనూ, చెల్లెలు లక్ష్మీకాంతమ్మ పాటలు పాడటంలోనూ రామచంద్రగారి అభిరుచిని పోషించారు. కవితలు అల్లడం, సంగీతం పాడటం, శిల్పకళాభిరుచి, చిత్రకళాభిరుచి రామచంద్రగారిలోచిన్నతనం నుండీ ఉన్నాయి. దీనికి గురువులు, బంధుకోటి బాగా దోహదం చేశారు. ఫస్టు ఫారం (ఆరవ తరగతి) చదువుతుండగానే రామచంద్ర ఛందస్సు స్వయంగా నేర్చుకుని ఒక 'సుగంధి వృత్తం' పద్యాన్ని రచించారు. ప్రాథమిక పాఠశాలలో ఉండగానే ఆశువుగా పాటలు పాడుకోవడం ఉంది. 24 గంటలూ కవిత్వాన్ని భావించడం, వ్రాయడం కనబడిన పుస్తకాలన్నీ చదవటం చేసేవాడు. ''వాడికి ఎవ్వరూ ఏ పనీ చెప్పకూడదు. వాడు చదువుకొంటుంటే డిస్టర్బ్ చెయ్యకూడదు'' అని రామచంద్రగారి అన్నగారు ఇంట్లో హుకుం జారీ చేశారట.

## 6. ఉన్నత పాఠశాల - ప్రబంధ పఠనం-తాళ్లూరి ఆర్ముగం పిళ్లైగారు:

ప్రాథమిక పాఠశాలలో మునిరత్నంగారు పద్యాలూ శ్లోకాలూ కంఠస్థం చేయించే వారేకాని వాటి అర్థాలను గురించి అంతగా చెప్పేవారు కారు. బట్టీ పట్టించడమే ఆయన ప్రధానోద్దేశం. అయినా అర్థాలు చెప్పినప్పటికీ అంత చిన్న పిల్లలకు ఏం తెలుస్తాయి? నీతి శాస్త్రంలో ఈ క్రింది శ్లోకాన్ని పిల్లలు కంఠస్థం చేశారు. రామచంద్రగారూ చేశారు.

''ముఖం పద్మ దళాకారం
వచశ్చందన శీతలమ్,
హృత్కర్తరీసమం చాతి
వినయం ధూర్త లక్షణమ్!''

ఇక్కడ శ్లోకం చదవడంలో చిన్న పిల్లలు ప్రతిపాదం ఒక ఖండంగా భావించి చదువుతారు. ఎక్కడ ఆపాలో వారికి సరిగా తెలియదు. ''హృత్కర్తరీ సమంచాతి'' అని ఆపుచేసి, తర్వాత ''వినయం ధూర్త లక్షణమ్'' అని చదివేవారు. 'వినయం ధూర్త లక్షణం' ఏమిటి? అని రామచంద్రగారికి అనుమానం వచ్చింది. ('అప్పిచ్చువాడు, వైద్యుడు' అని విడదీసి చదవకుండా కలిపి చదివేసి, 'వైద్యుడు అప్పిస్తాడు కాబోలు' అని భావించేవాళ్ళం మా చిన్నప్పుడు). హైస్కూల్లోకి వచ్చాక ''హృత్కర్తరీసమం చ+ అతి వినయం ధూర్త లక్షణమ్'' అని తెలుసుకున్నారు రామచంద్ర.

రామచంద్ర థర్డ్ ఫారం (8వ తరగతి)లో ఉండగానే మను చరిత్ర పద్యాలన్నీ చదివేశారు. ఎస్.ఎస్.ఎల్.సి.లోకి వచ్చేసరికి అన్ని ప్రబంధాలూ చదివేశారు. హైస్కూలులో ఉండగా Eassy Writing, Elocution, Recitation - అన్నింటిలోనూ రామచంద్రగారికే ప్రథమ బహుమతులు వచ్చేవి. ఆ బహుమతి పుస్తకాలను తానే ఎన్నుకునేవాడు. ఆ హైస్కూలు విద్యార్థి శ్రీ కృష్ణ కర్ణామృతాన్ని, పారిజాతాపహరణాన్ని తన బహుమతులుగా నిర్ణయించుకున్నాడంటే అతని సాహిత్యాభిరుచి ఎంత ఉన్నత స్థానంలో ఉందో మనం గ్రహించవచ్చు.

హైస్కూల్లో తెలుగు పండితుడైన తాళ్లూరి ఆర్ముగం పిళ్లైగారు పాఠ్యగ్రంథంలోని పద్యాలు చదువుతూ ఉంటే విద్యార్థియైన రామచంద్ర ప్రతి పదార్థం, దండాన్వయం, తాత్పర్యం చెప్పేవాడు. సులక్షణసారం, అనంతుని ఛందము స్వయంగా చదువుకొని ఛందో రహస్యాలు నేర్చుకున్నాడు రామ చంద్ర. తన కవితా శక్తిని ప్రదర్శిస్తూ హైస్కూలు ఉపాధ్యాయులపై పద్యాలు వ్రాసేవారు.

ఆంగ్లంలోకూడా చాలా పుస్తకాలు చదివారు. ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలో ఛందస్సుకు ఉదాహరణంగా తన సొంత పద్యాలు వ్రాశారు.

**7. కళాశాల విద్య - ''ప్రణయభంగం''**

మద్రాసు పచ్చయ్యప్ప కళాశాలలో ఇంటర్ మీడియట్ చదువుతూ ఉండగా రామచంద్రగారు మొదటి సంవత్సరంలో కచ దేవయాని వృత్తాంతాన్ని గ్రహించి 'ప్రణయభంగం' అనే పేరుతో కొన్ని పద్యాలు వ్రాశారు. రెండవ సంవత్సరంలో నలదమయంతుల వృత్తాంతాన్ని గ్రహించి చక్కని పద్యాలు వ్రాశారు. ఈ ఖండికలు రెండూ ఆ కళాశాల మేగజైన్‌లో ప్రచురింపబడ్డాయి. 'ప్రణయభంగం'లో దేవయాని కచునితో అన్నట్టుగా ఉన్న ఈ క్రింది పద్యంలో ధారాశుద్ధి ఎలా పరవళ్ళు త్రొక్కుతోందో గమనించండి :

''మోదితనైతి నా వలపమోఘమటంచు, విరాళి నా పయిన్
లేదనబోకురా!, మనసు లేబరమేనటరా!, నిలింపు లౌ
రా! దయలేని వారలటరా!, మది గోరితినిన్నె, కన్నియన్
గాదనబోకురా!, మదికకావికలై చనురా!, మనోహరా!''

ఇంటర్ మీడియేట్ చదివే విద్యార్థి ఇంత గొప్ప పద్యాన్ని వ్రాశాడంటే ఈనాడు కలలో కూడా విశ్వసించలేం. ఈనాడు తెలుగులో ఎం.ఏ.లూ, పిహెచ్.డి.లూ చేసే విద్యార్థులు పై పద్యంలోని ''లేబరము'' అనే మాటకు అర్థం చెప్పగలరా? అని ఆలోచిస్తే మన విద్యాస్థాయి ఎంతగా దిగజారిపోయిందో తెలుస్తుంది.

**8. అద్దాల నాయుడుగారు - ''స్విష్వగ్రోగ్ర''**

1956-59 మధ్యకాలంలో రామచంద్రగారు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో బి.ఏ. ఆనర్సు తెలుగు చదువుతూవుండేవారు. ఆ రోజుల్లో ఒకసారి స్వగ్రామం వెళ్లారు. నేలటూరు ప్రక్కనే 'పూనిమాంగాడు' అనే మరో గ్రామం ఉంది. ఆ ఊళ్లో అద్దాల నారాయణస్వామి నాయుడు అనే ఒక రైతు ఉండేవాడు. ఆయన వావిలకొలను సుబ్బారావుగారి 'కుమారాభ్యుదయం' అనే కావ్యం చదివాడు. దాంట్లో ఒక పద్యంలో ''స్విష్వగ్రోగ్ర'' అనే సమాసం వచ్చింది. తన దగ్గరకు ఎవరైనా తెలుగు చదువుకున్నవాళ్లు వస్తే ఈ సమాసాన్ని విడదీసి అర్థం చెప్పమని ఛాలెంజీ విసిరేవాడు ఆ అద్దాల నాయుడుగారు. బి.ఏ. ఆనర్సు తెలుగు చదువుతున్న రామచంద్ర ఆయన పాలబడ్డాడు. రామచంద్ర మామూలు విద్యార్థి

కాదు కదా భయపడటానికి! ఎంతో శ్రద్ధగా చిన్నతనం నుండీ సంస్కృతాంధ్రాలు గట్టిగా చదివినవాడు. ఆ సమాసాన్ని వెంటనే విడదీసి అర్థం చెప్పాడు: ''సు + ఇషు + అగ్ర + ఉగ్ర = ''మంచి బాణము యొక్క అగ్రము యొక్క ఉగ్రత॥ అద్దాల నాయుడుగారు ఆశ్చర్యపోయారు. రామచంద్రను ఎంతగానో ప్రశంసించారు.

ఆనర్సు అయిపోయి చీరాలలో ఉద్యోగం చేస్తున్న రోజులలో (1959-60) రామచంద్రగారికి ఉజ్వల భవిష్యత్తును చూపించిన మహానుభావుడు వేదాచలం అయ్యవారు దుర్భర దారిద్ర్యంతో బాధపడి చనిపోయారు. ఈ విషయం ఆలస్యంగా తెలిసింది రామచంద్రగారికి. అ అయ్యవారికి తన తల్లిదండ్రులు కొంత సహాయం చేసినప్పటికీ, తాను అనుకున్నంత సహాయం చేయలేకపోయానే అని, ఆ విషయం తలచుకుని ఇప్పటికీ కంటనీరు పెట్టుకుంటారు రామచంద్ర! వీరు తిరుపతిలో పరిశోధన చేసేటప్పుడు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారికి కన్నకుమారుని కన్నా మిన్నగా సేవ చేశారు. దీనికి మేమిద్దరం ప్రత్యక్ష సాక్షులం. రామచంద్ర గురుభక్తి అంతగొప్పది!

**9. రామచంద్రగారి రచనలు :**

ఆచార్య వంకలపాటి రామచంద్ర చౌదరి గారి సాహిత్య కృషిలో రెండు ప్రధాన విభాగాలున్నాయి: (i) పరిశోధన (ii) కవిత్వం. నిజానికి ఈ రెండింటికీ పొత్తు కుదరదు. మంచి కవి అయిన వాడు పట్టుదలగా కూర్చుని పరిశోధన చేయలేడు. పట్టుదలగా ఆసన సిద్ధిని సాధించి పరిశోధన చేసేవాడు, సృజనాత్మక రచనలు చేయలేడు. ఇది నిజంగా జోడుగుర్రాల స్వారీయే! కాని ఈ రకమైన సర్కసు ఫీట్లు చేసిన ప్రొఫెసర్లు కొద్ది మంది మాత్రం ఉన్నారు. పింగళి లక్ష్మీకాంతం, యస్వీ. జోగారావు, సి. నారాయణరెడ్డి, నాయని కృష్ణకుమారి, టి. కోటీశ్వర రావు, వి. రామచంద్ర, సుప్రసన్న, కొర్లపాటి శ్రీరామమూర్తి, తంగిరాల సుబ్బారావు, కొలకలూరి ఇనాక్, మాదిరాజు రంగారావు, బేతవోలు రామబ్రహ్మం, ఎన్. గోపి ప్రభృతులు. ఇక్కడ ఒక ముఖ్య విషయం గమనించాలి. ఎవరైనా సరే పరిశోధన చేసి పిహెచ్.డి. డిగ్రీ పొందవచ్చు, యూనివర్సిటీలో ప్రొఫెసరు కూడా కావచ్చు. కాని కవిత్వాన్ని మాత్రం అందరూ వ్రాయలేరు. తెలుగు ప్రొఫెసర్లందరూ కవులు కాలేరు. కవులు మాత్రం తెలుగు ప్రొఫెసర్లు కావచ్చు. తెలుగు ప్రొఫెసరై ఉండి, దైవదత్తమైన అతి విశిష్టమైన కవితాశక్తిని కూడా కలిగి ఉన్న వ్యక్తి రామచంద్ర చౌదరిగారు.

రామచంద్రగారి రచనలు :

**ముద్రితాలు :**

1. శ్రీ వేంకటేశ్వర శతకము, 1969
2. అశ్రుతర్పణం, 1970
3. ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వర బిరుదము - ఔచిత్యము (ఎఱ్ఱన కళాపీఠం, బహుమతి పొందిన రచన) 1984
4. ఎఱ్ఱాప్రెగ్గడ (తెలుగు విశ్వ విద్యాలయ ప్రచురణ)
5. హరినారాయణ ఆప్టే (ఆర్.బి. జోషి రచనకు అనువాదం), సాహిత్య అకాడమి, 1989
6. తిక్కన కవితా శిల్పము, 1989

**అముద్రిత రచనలు :**

1. జానపదగేయం సంకలనం
2. సుధాలహరి (ఖండ కావ్య సంపుటి)
3. కళాభిరామం (వీథీ రూపకం)
4. శోభ (బౌద్ధ భిక్షుకి కథ)
5. మహాప్రబోధం (గేయాలు, వచన కవితలు)
6. నాటికల సంపుటి
7. రామచంద్ర శతకము ('రమ్య సుగణ సాంద్ర రామచంద్ర!' మకుటంతో)
8. A Critical Study of Errapragada's Works

ఇవి కాకుండా పరిశోధన పత్రాలు, చర్చా గోష్ఠి వ్యాసాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.

1964 ఆగష్టు మాసంలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు రామచంద్రగారికి ఇచ్చిన Testimonial లో ఇలా వ్రాశారు : "He is an accomplished scholar both in Sanskrit and Telugu, far beyond the extent which his age vouchsafes, and to balance it he has a thorough knowledge of the principles of Modern Criticism which he aptly applies to classical literature in interpreting it. His historical sense, in addition, enables him to view things in their proper perspective."

కవితా రచనలు చేయడమే కాని, వాటి ప్రకటన విషయం పట్టించుకోని రామచంద్రగారిని నిరంతరం ప్రోత్సహిస్తూ, ఆయన అభివృద్ధిని మనసారా

కోరి పాటుపడే మహావ్యక్తి ఆచార్య తూమాటి దోణప్పగారు. వారి ప్రోత్సాహమే లేని పక్షంలో ఈయన తన 'తిక్కన కవితా శిల్పము' కూడా ప్రకటించి ఉండేవారు కారు.

రామచంద్ర చౌదరిగారి విద్యాగురువైన ఆచార్య యస్వీ. జోగారావుగారు వీరి 'తిక్కన కవితా శిల్పము' అనే గ్రంథాన్ని చదివి మెచ్చుకుంటూ ఇలా లేఖ వ్రాశారు:

2.2.90

ఆత్మీయుడు అంతర్వాణి వరేణ్యుడు మా రామచంద్రునకు సౌహార్ద సాధువాదములు. ఉభయ కుశలోపరి. నీవు సాదరంగా స్వయంగా వచ్చి అందజేసిన నీ 'తిక్కన కవితా శిల్పము' కృతిని నాకు తిక్కన మీద, నీ మీద ఉన్న ప్రతిపత్తి వల్ల వెంటనే పఠనం ప్రారంభించి చాలా మట్టుకు చదివేశాను. నీ సమీక్ష సమగ్ర వైమర్శిక దృక్పథంతో చతురస్రంగా సాగింది. నీ ప్రణాళిక పటువైనది. రచన రమణీయంగా వుంది. నీవు పరమ భావుక పట్టభద్రుడవు. దొడ్డ కవి వని ఏనాడో గుర్తించాను. కాని ఇంతటి విమర్శకుడివి, పరిశోధకుడివి అని గుర్తించలేదు. ఇప్పుడు నీ సమగ్ర సారస్వతమూర్తి మత్వమును గ్రహించి ఎంతో సంతోషించాను. గచ్ఛ శివాస్తే పంథానస్సంతు!

నీ
ఉపాధ్యాయుడు
యస్వీ

ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఆనర్సు చదివే రోజులలో హాస్టలు భోజనంతో విసిగిపోయిన రామచంద్రగారు ఒక చక్కని చాటువు చెప్పారు. హాస్టల్లో ప్రతిరోజూ దొండకాయ కూర వండుతూ ఉండేవారు. దొండకాయ కూర ఎక్కువగా తింటే చెవుడు వస్తుందని అంటారు. ఈ అభిప్రాయాన్ని మనసులో పెట్టుకుని, ఇలా చాటువును అల్లారు :

''ముగ్గి చన్న బియ్యపుం బువ్వ కమికిళ్ల
నారు దొండకాయ కూరతోడ
మెక్కి మెక్కి చెవులు తిక్కెక్కిపోయెరా
రమ్య సుగుణసాంద్ర! రామచంద్ర!''

తరువాత రామచంద్రగారికి 'సుగుణ' అనే అమ్మాయితో పెళ్లి కావడం కాకతాళీయంగా జరిగింది.

ఒకానొక సమయంలో తన కవిత్వాన్ని గురించి రామచంద్రగారు ఇలా చెప్పుకున్నారు :

''మంజుల కిసలయ ఖాదన
సంజనిత నితాంత మధుర సంగీత కలా
రంజిత పుంస్కోకిల రుత
మంజులతా గంజనములు మామక ఫణితుల్!''

రామచంద్రగారి రచనల్లో పరిశోధనకు సంబంధించినవి మాత్రమే ఎక్కువగా ముద్రిత మయ్యాయి. సృజనాత్మక (కవిత్వ) రచనల్లో శ్రీ వేంకటేశ్వర శతకము, అశ్రుతర్పణం - అనే రెండు రచనలే ప్రకటితాలు. అముద్రిత రచనలన్నీ ఎక్కువగా సృజనాత్మక రచనలే. ఇవన్నీ త్వరలో - అతి త్వరలో వెలుగు చూడాలని సాహిత్యాభిమానులందరూ ఆకాంక్షిస్తున్నారు. రామచంద్రగారు ఈ విషయంలో శ్రద్ధ వహిస్తారని మేమిద్దరం ఆశిస్తున్నాం... భవతు!



# విజయ విలాపము

– వి. రామచంద్ర చౌదరి

భీమమౌ కురుక్షేత్ర సంగ్రామ భూమిఁ
దనువు వీడిన సకల బాంధవుల యాత్మ
శాంతికై నివాపాంజలుల్ సంఘటించు
తఱిని రాధేయునకుఁ దిలోదకము లిచ్చు
దిక్కెవండని పాండవుల్ తికమక పడ! 1

బొటబొట కన్నీరొలుకఁగఁ
దటతటమని గుండె లదరఁ దను వెల్లఁబరి
స్ఫుటకంపమై తనర్పఁగఁ
నట మటమై ధైర్యమెల్ల నాఁడి వోవన్. 2

పలుకంగఁ బెదవి గదపును
నిలుపంగాఁ జూచునడలు నేఁదు కడకున్
బలుకంగ నడలు గడవఁగఁ
బల వించున్ గుంతి దుఃఖ భారానతయై! 3

అది యెల్లఁ గనిన పాండవు
లిది యేలాతల్లి వగచునిప్పుడు తోప్పె
మొదవెనొ తమవల నన్నను
నదరున నందఱును దల్లి కభిముఖు లగుచున్. 4

ఎలుఁగు దగులు వడఁగ నేడ్చెద వేటికో
తల్లి చెప్పు మెట్టి తప్పు గలిగె
మా యెడలను, డాపమఱియేల కష్టమ్ము
లింతకంటె వచ్చునేమి యింక! 5

ఎన్నొ బాధలు గడచి గట్టెక్కి యిపుడు
సంతసింపంగ వలసిన సమయమందు
ఈ యసందర్భమైన యేడ్పేమి తల్లి?
కారణము దెల్పు మాకుఁ గరుణ ననుచు 6

అడిగిన నామెయు వగచే
సుడివడు లోగొంతు నెట్లొ గ్రుక్కించుక వా
పిడి గం బాఱెడు నశ్రుల
నుడుపక ముఖమల్ల వంచి యూర్జిత మతియై 7

అనునిట్లు ''తండ్రులార! మ
దిని డాచి రహస్య మొకఁడు తేకువమెయి నే
నన మీతోనిన్నా ళ్ళిపు
డనకుండఁగ రాదు సమయ మరుదెంచె నిదే! 8

రవి నాకున్గనెఁ గర్ణుఁ గన్ననయి నే రంజిల్లుచో మేడపై
రవి నీక్షించుచు సిద్ధ మంత్రమగు దుర్వాస ప్రదత్తాద్భుత
స్తవముం జేసిన తప్పుచేఁ గలిగెనాతం డింత కాలంబు నే
నవమానంబున కంగలించి యిటు సత్యంబు న్మది న్డాచితిన్ 9

ఏనీ విషయము దాచితి
నీనాటికిఁ బాప ఫలమిదే పండెనిఁకను
మౌనమున సైపలే నీ
కానేయునిఁ గన్న కడపు కలఁతలు వినుఁడీ! 10

కాడాతడు రాధేయుఁడు
కాడాతఁడు సూత సుతుఁడు కాడెన్నటికిన్
పోఁడిమి చెడి నాచేసిన
కీడున రాధేయుఁడను నకీర్తి భరించెన్. 11

కర్ణుఁడు మీయగ్రజుఁడే
కర్ణుఁడు నాకన్నకొడుకె కాదెవరో శౌ
ర్యార్ణవుఁడగు వానికినిఁ ది
లార్ణోదానంబు సల్పుఁడయ్యా భక్తిన్!'' 12

అనుచుఁ బల్కి వివశయై నేల కొఱఁగిన
తల్లి ధర్మజుండుఁ దమ్ములొక్క
యర్జునుండు దక్క యంకమ్ములందిడి
సేదదీర్చి రపుడు చేతనత్వ
మెల్లయుడిగి నిలిచి యెచ్చటనోజూచు
ఫల్గునుండు కొంత వడికిఁ గదలి 13

అతలాకుతలంబై మన
సతిదుస్తరమైన బాధ కగ్గము గాఁగన్
మతి చెడినవాని గతి నతఁ
డతి తీవ్రతఁ బల్కెఁ దల్లి యలజడి గనియున్. 14

''ఇంతటి పాపకార్యమిది యేమని చేసితి వమ్మ మాకు నా
వంతయు సత్యమున్ దెలుప కాగ్రహమున్ బెరుగంగఁ జేసి దు
స్స్వాంతులఁ జేసి వైచితివి అన్నను జంపిన పాపివై యిసీ
కుంతికి నేను బిడ్డననుకోనీకఁ జెల్లునె! యింత మోసమే! 15

తల్లీ! కన్న సుతున్ మహాబలు నమంద ప్రజ్ఞా శౌర్యాన్వితు
న్నుల్లం బించుకనొవ్వ కుండ నెటుగా నూహించితోమిత్తికిన్
జెల్లింపంగ వృథా మహా సమరమున్ జేయించి నిస్స్వార్థు దై
ర్యోల్లాసి న్మడియంగఁ జూచితిరి యుద్ధోన్మాది యీ క్రీడిచేన్. 16

ఎఱిఁగి యెఱింగి యగ్రజుని హింసకుఁ బాల్పడఁ జేసినావు నీ
వెఱుఁగని దైనచో సరియె యీ భవదీయ తనూజు చిత్తమీ,

యెఱుక భరింప లేను జననీ! వరజన్ము పవిత్ర రక్తమున్
మఱగిని హస్తముల్ నఱికి మండఁగఁ బెట్టక శాంతిఁగందునే! 17

ఇంత తెలిసిన దాన విదేమి తల్లి!
క్షాత్ర మొక వంకగా రహస్యమ్ము దాచి
మమ్ముఁబురి కొల్పి సమర సమ్మర్ద మందు
కొడుకుఁ గొడుకుచే జంపించుకొంటి వీవు. 18

సరియె నీ విట్టు లబలవై సలిపినావు
సర్వవిదుఁడు శ్రీ కృష్ణుఁ డీ సడికి నేల
పాల్పడియెఁ గర్ణు నా చేతఁ గూల్పఁజేసి
ఇంత కఠినుఁడె కృష్ణుఁ డీ వింత యేమొ! 19

యుద్ధము యుద్ధమంచుఁదెగి యూరక గంతులువైచి రందఱీ
యుద్ధము నా సహోదరుని యూపిరిఁ బీల్చునటన్న సత్య మీ
బుద్ధికిఁ దోఁపదయ్యె నను మూర్ఖునిగానొనరించి యీయసం
బద్ధపుఁ గార్యమున్ జరుపఁబంచిన కృష్ణుని తృష్ణతీఱెనో! 20

అర్జునుఁడంచు భీషణ మహాహవ రంగము నందు వైరికిన్
దుర్జయుఁ డంచు లోకులు నుతుల్పచరింతురె గాని యెవ్వరు
న్నర్జునుఁడింత క్రూరుఁడని యన్నను జంపిన నిర్దయాత్ముఁడున్
దుర్జనుఁడంచుఁ బల్కరొక తూరియు దీని సహించు టెట్లొకో! 21

తమ్ముఁ డని యెంచి వాడి వాలమ్ము వేయు
నెడలఁ జూచి చూడక పోవనిచ్చెఁ గాని
అతఁడొక యింత తెగిన నేనా యెదిర్చి
సమర మొనరింపఁ గలవాఁడఁ జావకుండ!'' 22

అనుచు వాపోవు నతనితో యమతనూజుఁ
డిట్టులను ''నర్జునా! మనకెల్ల రకును
ఏభవంబున పాపమో యిప్పుడనుభ
వమ్మునకు వచ్చెఁ జింతిల్ల వలదు వినుము. 23

ఇది నా మూర్ఖత గాకెటు
లొదవు నొరుల యెడల దొసఁగులో తమ్ముఁడ న

న్నదయాత్మ నసక గొంతిని
పదరంగా నేల నీవు పనవంగ నేలా! 24

మనమెల్లఁ గస్తి పాలయి
వనములలోఁ గోపమెత్తి వారక యుద్ధం
బునకట్లు సిద్ధ పడ నే
మనుగొంతి? రణంబు మానుఁడనునే మనతోన్? 25

కర్ణుఁడచటఁ దన్ను ఘనమైత్రిఁ బాటించు
ధార్తరాష్ట్రునెట్టి తరుణ మందుఁ
బాయఁడాత్మమాన ప్రాణంబులతనిక
పుచ్చియిచ్చు దుసికి పోడతండు. 26

అట్టితఱిఁ గుంతి యేమి సేయంగఁ గలదు
దుఃఖ భాజనమైన ప్రాదుర్భవంబుఁ
గాంచినందుల కల్లాడుకంటె నామె
నేల నిందింప మనకర్మ మిట్టులుండ! 27

అతఁడన్నయని యెఱింగిన
మతినెంతునె రాజ్యమొకఁడు మాన్య చరిత్రుల్
మతి మంతులైన మీరలుఁ
గొతుకుదురే గౌరవింప గుణయుతు నతనిన్. 28

అకటా కర్ణునిఁ గన నా
కొకమాఱును రాదు కోప ముల్లములోఁ గుం
తికి మాఱు రూపమై యతఁ
డకలంకుఁడు గాఁ గ దోచు నా హేతువునన్ 29

సంశయించియు నెఱుఁగంగ సలుప నేఁ బ్ర
యత్న మక్కట తుదిఁబోయి యాతఁడన్న
యగుటయున్ మనమాతని యనుజు లగుట
యున్ గదా వచ్చె నిపుడేమి యున్నదింక! 30

అంతటి పౌరుష వంతుడు
నంతటి నిస్స్వార్థ పరుఁడు నంతటి ధీర

స్వాంతుఁడు నెఱదాతయు నీ
కౌంతేయుల కేలదక్కుఁ గౌంతేయుండై! 31

నిందకు నోర్చి మర్మమును నిప్పొడి గట్టినయట్లు దాచె నే
మందము గొంతి నిగ్రహము నక్కట! ఇంక రహస్య గోపనం
బెందును జేయలేని బలహీన మనస్కతఁ గాంచి యంగనల్
మందురుగాక యెవ్వరును మర్మము చెప్పరుగాక యింతికిన్.'' 32

అని పలుక మిన్న కుండెఁ నర్జునుఁడు బాష్ప
కలుషితాస్యులై భీముండుఁ గవలు నిలిచి
రంత ధైర్యమ్ము వహియించి కుంతి కర్ణు
నాత్మ శాంత్యర్థమై నివాపాంజలి ప్ర
దాన మొనరింపఁ బంచె నాధర్మతనయు. 33

అతఁడు నెట్టకేనియు నియతాత్ముఁడగుచు
తిలలు జలమును పుడిసిట నలవరించి
విడిచెఁ గర్ణునాత్మకు శాంతి వెలయు ననుచు
ఎల్ల సద్గతులతని కయ్యెడు మటంచు! 34

పాండుతనయుల కన్నుల నిండఁ గర్ణు
రూపమే వెల్గు చుండె నాత్మాపరాధ
జనిత మైనట్టి పాప సంక్షయము గోరి
మోడ్పుగేలు లౌదలలపై మోపునపుడు. 35



సౌరభము లేల చిమ్ముఁ బుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదచల్లుఁ జందమామ?
ఏల సలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?

– కృష్ణశాస్త్రి

## రాయలసీమ కవిరత్నం - ''కవి జహాఁపనా''

# కలుగోట్ల విజయాత్రేయ

- జె. యస్. ఆర్. కె. శర్మ

''కవిర్జాయతే'' అని మనవాళ్లంటే "Poets are born but not made'' అని అంటున్నారు పాశ్చాత్యులు. ''Art is God given gift'' అని వాళ్లంటే, ''కళ దైవదత్త మయిన ప్రతిభ'' అని మనవారంటున్నారు. ఈ అభిప్రాయాలకు ప్రబల ప్రతీకగా విరబూచిన కవితా కమనీయ రసరమణీయ మనోహర దేవమందారం మాప్రియతమ మిత్రుడు శ్రీ కలుగోట్ల విజయాత్రేయ!

ఈయన్ని ' దేవమందారం ' అని ఎందు కంటున్నానంటే- కవిత్వానికి సంబంధించిన చదువేదీ ఈయన ప్రత్యేకంగా చదువుకోలేదు కనుక. కేవలం శ్రీ రాజరాజేశ్వరీదేవి సంపూర్ణానుగ్రహవాత్సల్య మకరందాభిషేక ప్రభావంతో శరపరంపరగా కలమంజుల రసరంజిత కవితలల్లి, తెలుగు సాహితీ ప్రియుల్ని అవిరామంగా అలరిస్తున్నాడు కనుక.

సహజంగా పద్యశిల్ప కల్పనా ప్రవీణులు గేయ నిర్మాణం చేయులేరనీ, గేయరచనా ధురీణులు వచన రచనా పారీణులు కాలేరనీ ఒక వాడుక. పద్య గద్య గేయ రచనలనేకం చేసిన సాహితీ సవ్యసాచి మా విజయాత్రేయ పై సిద్ధాంతానికి భిన్నంగా ప్రతిభా ప్రసారం కావించాడు.

ఇంచుమించుగా ఇరవై పద్య కావ్యాలు కృతిభర్తల కోరిక పై వ్రాసి, అందంగా అచ్చు వేయించి, ఆంధ్రభారతిని అలరించినాడు. ఈ యిరవయ్యో శతాబ్దంలో ఇది ఒక అద్భుతం!

దాదాపు వంద నవలలు వ్రాయగా, 43 నవలలు M.U.S. మద్రాసు వారు ప్రచురిస్తే, 'వీథినర్తకి' అనే నవలను విజయవాడ వాహినీ ప్రచురణలు ప్రకటించింది. ఒకటి రెండు నవలికలు, పద్య ఖండికలు 'యువజ్యోతి', 'కృష్ణాపత్రిక', 'సంసారం', 'జయశ్రీ', 'జాగృతి', 'శ్రీశైలప్రభ' వంటి పత్రికలలో ప్రకటించటం జరిగింది.

ఈయన కవితలు సర్వతంత్ర స్వతంత్రాలు. వ్యాపార దృష్టితో వ్రాసినవి ఎంత మాత్రం కావు. ఇది నేనెరిగిన సత్యం.

రాజసంలో పుట్టి, రాజసంలో పెరిగి, రాజసంలోనే జీవిస్తున్న కవి రాజరాజు మా విజయుడు!

విజయాత్రేయ వ్రాసిన సాహిత్య రంగస్థల నాటకం 'ఆంధ్రభోజుడు' -మహారాజశ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారి జన్మదిన మహోత్సవ సందర్భంగా- బ్రాహ్మణ కొట్కూరులో నేను ప్రయోక్తగా ప్రదర్శించడం జరింగింది. అది విజయవంతమూ అయింది. పౌరాణిక నాటకం 'మైరావణ' ధూళిపాళ వారు వ్రాయిస్తే- చారిత్రక నాటకం ' రాణీ సంయుక్త', రాయలసీమ నటరత్న అల్లా బఖు గారు వ్రాయించారు. పైరెండూ వెలుగులోకి రాలేదు. 'భీష్మవిజయం' అనే ఏకాంకిక, ' ప్రవరుడు', 'సత్యభామ', 'చిత్రాంగి', 'సుయోధనుడు', 'కర్ణుడు', 'అల్లూరి సీతారామరాజు' అనే ఏకపాత్రలు వ్రాశాడు. వీరిఏకపాత్రలలో 'కృష్ణ దేవరాయలు' కూడా ఉంది.

విజయాత్రేయ హృదయం కవితా మకరంద మహార్ణవం. ఎటు కాలువ తీస్తే అటు ప్రవహించి క్రేళ్లురుకుతుంది.

హైదరాబాదు, కడప, అనంతపురం, కర్నూలు, ఆకాశవాణి కేంద్రాలు ఈయన కవితలెన్నో ప్రసారం చేశాయి, చేస్తున్నాయి, చేయబోతున్నాయి. దూర దర్శన్ వారు ఈ రాయల సీమ కవిని పరిచయం చేయకపోవటం వారికే లోటు.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, డా. నండూరి రామకృష్ణమా చార్యులు, డా. దాశరథి, డా.సి.నారాయణరెడ్డి, డా.గుంటూరు శేషేంద్రశర్మ, డా. అమరేంద్ర, శ్రీ అనుముల కృష్ణమూర్తి, మహాకవి మల్లంపల్లి శరభయ్యగారు, ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు వంటి ఆంధ్రసాహితీ కవితా ప్రముఖులు ఎందరో అగ్రశ్రేణి కవిగా విజయాత్రేయను అభివర్ణిస్తున్నప్పుడు, ఆయన కవిత్వం గురించి అదనంగా వ్యాఖ్యానించడం అవసరం కాదనుకుంటాను. అల మిన్నందిన వాడి పొడవింతని చెప్పటానికి సాధ్యం కానట్లే, మా కవితాసవ్యసాచి, కవితౌన్నత్యాన్ని ఉల్లేఖించటం కూడా సాధ్యంకాదు.

ఇంటర్ మీటియేట్ బై.పి.సి. అడ్డకట్టను తెగద్రెంచుకుని పడదూకిన కవితాప్రవాహంలో - విద్య డిగ్రీలు కొట్టుకొనిపోగా, డాక్టరు కావలసినవాడు యాక్టరు కావాలని మోజుపడి, చివరకు కవిగా మనకు మిగిలిపోయాడు. ప్రతిభను డిగ్రీలతో కొలవటం అసమంజసం. డిగ్రీలనేవి అవిరళ కృషిక సాహిత్యపరిశ్రమకు తార్కాణాలు కాని ప్రతిభకు కావు. నాకే అధికారముంటే విజయాత్రేయ అఖండ సాహిత్యసేవకు, అనల్ప ప్రతిభకు ఒక గౌరవ డాక్టరేట్ పట్టా బహూకరించేవాడిని.

విజయాత్రేయ కావ్యాలపై, నవలలపై, వచన కవితలపై పరిశోధన చేయటం ఒక సాహిత్యావసరం.

1983లో కర్నూలు జిల్లా మండల కేంద్రమైన 'ఓర్వకల్లు' గ్రామంలో రెండు రోజులపాటు విజయాత్రేయ కవితా రజతోత్సవాలు, విందులు, వినోదాలు, సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలతో జరిపించి, 5 వేల రూపాయల పర్సుతో, ''కవి జహాంపనా'' బిరుదుతో సత్కరించటం ఒక విశేషం. ప్రాంతీయ విజయాత్రేయ సాహిత్యాభిమానులు రజతోత్సవ సారథ్యబాధ్యత నాకప్పగించారు ఆనాడు.

స్వర్గీయ గుండా రత్నంశెట్టి గారు (ద్రోణాచలం) వీరి ''ఊర్వశి'' కావ్యాన్ని అంకితం తీసికొని గౌరవించారు. శ్రీ ఇ.వి. రాజేంద్రశర్మ 'దాశకన్య' కృతినీ వారిసోదరులు శ్రీ ఇ.వి. సుజాతశర్మ 'లాస్యగౌరి' కృతినీ అంకితం తీసికొని, బంగారు ఉంగరాలిచ్చి, కాశ్మీరు శాలువకప్పి సత్కరించారు. మహారాజశ్రీ మద్దూరు సుబ్బారెడ్డిగారు వీరి 'మహర్షి రావణ' కృతిని గ్రహించి, స్వర్ణకంకణం తొడిగారు.

''నా వృత్తి వ్యవసాయం, వ్యావృత్తి కవితావ్యవసాయం, ప్రవృత్తి సౌందర్యోపాసన''- అని విజయాత్రేయగారే స్వయంగా చెప్పుకున్నారు. ఇది ప్రత్యక్షరసత్యం. ఈయన కవితకు సంబంధించిన ఒక అతిముఖ్యమైన విషయాన్ని మనవిచేసి, వీరి జీవనాంగణంలో అడుగుపెడతాను. (ప్రారంభంలో సమర్పించివలసిన అంశాన్ని మధ్యలో నివేదించుచున్న నా స్వాతంత్ర్యాన్నీ సాహసాన్నీ మన్నింతురుగాక!)

అభినవకృష్ణరాయలు, నెరదాత, సౌజన్య సౌహార్దక మనస్వి, అఖండ యశస్వి, త్యాగైక తపస్వి, ప్రముఖ పారిశ్రామికవేత్త మహారాజశ్రీ S.P.Y. రెడ్డి B.E.(Mech) గారు శ్రీవిజయాత్రేయగారి 'కర్ణుడు' కావ్యాన్ని అంకితం తీసుకోవడమేకాక, ప్రతినెలా వేయిరూపాయలు కర్పూర చందన తాంబూల దక్షిణగా సమర్పించి, తమ ఆస్థానకవిగా పోషిస్తూ, కవితాసరస్వతిని ఆరాధిస్తున్నారు. శ్రీరెడ్డిగారు నంద్యాల నందీ సుజలా పైపుల ఫ్యాక్టరీ యజమాని. ఈ 20వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఈ వైయక్తిక కళాపోషణ విచిత్రంగానే కనబడుతుంది.

మా విజయాత్రేయ కవిగా తెలుగు విశ్వవిద్యాలయంనుంచీ, జాతీయ సాహిత్య పరిషత్తు సిద్దిపేట శాఖనుండీ, కడప గడియారం స్మారక సంఘం నుండీ, మచిలీపట్టణం త్రిపురసుందరీ ఫౌండేషన్ నుండీ అవార్డులు అందుకున్నారు. సామాన్య సన్మానాలెన్నో గ్రహించారు. ఇంకా ఎన్నో ఘరానా అవార్డులు అయిన్ని

వరించవలసి ఉంది. వస్తాయనుకుంటున్నాను. చెయ్యవలసిందేదో శ్రీరాజరాజేశ్వరీ దేవీ చేసిపెడుతుంది. పోతే దైవం మానుష రూపేణ కావచ్చు.

''కలుగోట్ల విజయాత్రేయ'' అన్న ఆయన పేరులోనే ''కవి'' దాగి ఉన్నాడు. మధురాతి మధురంగా ఒదిగిపోయి ఉన్నాడు. ''మధురం మధురం...'' అన్నట్లు, మా విజయాత్రేయ వయసు, సొగసు, మనసు, పలుకు - అంతా మధురమే, మంజులమే,మంగళకరమే. ఆయన సాన్నిహిత్యమే ఒక తీయనిహాయి.

కవితాప్రారంభదశలో 'మణికంకణం' చిరుకావ్యం పంపినపుడు చదివి, ''ఆపాత మధురమయిన ఈ కావ్యం, ఇందలి ప్రతి అక్షరం వెనుక తొణికిసలాడే తేనె గుండె తిలకించి పులకించినాను'' అన్నారు డా. నండూరి రామకృష్ణ మాచార్యగారు. డా. ప్రసాదరాయకులపతిగారి అంతరంగాన్ని కూడా వీరికవితా మధురిమ ఆకర్షించింది, అలరించింది. ఎందరో నటులు, కవులు, నవలాకారులు వీరి నభిమానిస్తున్నారు. విజయాత్రేయ గారి వ్యాపకం చాలా పెద్ద పరిధిలోనే ఉంది. తెలుగు కవితా సరస్వతికి మణికిరీటం కవితాకిరీటి 'క.వి.'!

విజయాత్రేయను గురించి పరిచయ వాక్యాలు పలకటంలో ద్వితీయఘట్టం ముగిసింది. ఒక మెట్టు క్రిందకు దిగి ప్రథమఘట్టానికి రావాలి, వస్తున్నాను.

కర్నూలు జిల్లా, నంద్యాల తాలూకా, గడిమేముల మండలం, గని గ్రామంలో ఒక మధ్యతరగతి ఆభిజాత్య నందవరీక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు కలుగోట్ల విజయాత్రేయగారు. తండ్రి కలుగోట్ల శంకరరావు, తల్లి లక్ష్మీదేవమ్మ. కాని వీరికి తప్పటడుగులు కూడా వెయ్యలేని ప్రాయంలోనే తండ్రి మరణించ టంతో, పినతండ్రి - బహుగ్రంథ పరిశోధనా ధురీణులు, భారతసారవేది, పౌరాణిక ప్రవీణ (వృత్తి కాదు), డిగ్రీలు లేని సాహిత్యసార్వభౌముడు, సాము గరిడీలు, కుస్తీలు నేర్చిన అలనాటి పెహెలాడు, పల్లెటూరి రాజకీయాలలో గడితేరి ముడివారిన మనీషి - శ్రీ కలుగోట్ల సుందరరావుగారూ వారి సతీమణి మీనాక్షమ్మగారూ కంటి పాపనులా కాపాడిపెంచారు. 'క.వి.' గారిని అందరూ సుందరరావుగారి కొడుకనే అంటారు; అలాగే చలామణి ఔతున్నారు. విజయాత్రేయగారి సుందర సౌవర్ణ సాహిత్యసౌధానికి వజ్రాలపునాది సుందరరావుగారి అపారమేధాసంపద.

'క.వి' గారికి మేనమామ కూతురు 'విజయలక్ష్మి'తో వివాహం జరిగింది. సంతానం నలుగురు ఆడపిల్లలు, ఒక కుమారుడు. కర్నూలు జిల్లాకు విచ్చేసిన కవిగాయక నటపండిత మహాశయులందరూ వీరి అతిథ్యాన్ని రుచి చూచినవారే; అభిమానించినవారే. వీరియింట భోజనసౌఖ్యానికి లోటులేదు-రాజభోజనం!

కవిగా జన్మించి, కవితకే జీవితాన్ని అంకితం కావించి, కవిగా కొనసాగుతూ, రైతు జీవితాన్నే గడుపుతున్నారు విజయాత్రేయగారు.

- ఇవండీ, నా ఆంతరంగిక మిత్రుడు శ్రీవిజయాత్రేయ జీవిత విశేషాలు.

''అపారభావనా బలం కల మా విజయాత్రేయ ఆంధ్రకవితా సరస్వతి దివ్యవేణిలో ఒకపాయ. నీ లేఖినీ ముఖంలో సరస్వతి నివసించె నయ్యా! విజయం నీ దేనయ్యా, విజయాత్రేయా!'' అని దాశరథిగారంటే; ''మా చిరంజీవి ఒక తెలుగు వెలుగు'' అంటున్నారు డా. నండూరి. ''సరస కవి తిలక'' అన్నారు మహానటుడు చిత్తూరు నాగయ్య.

''పద్యరచన మీ చేతిలో పానకంలా పారుతుంటుంది; వైనంలా ఒదిగి పోతుంటుంది. మాధురీ గుణం మీ కవితలో మారాకు హత్తుకున్న సహజలక్షణం. అనుప్రాస మీ కవితలో కోతి కొమ్మచ్చు లాడుకుంటుంది. లలిత లలితభావాలకు మీ పద్యాలు హృద్యసదనాలు. పద్యంలో వ్రాసినా మీ కవిత గేయసౌరభాన్నందు కొన్నది'' అంటున్నారు సి.నా.రె.

''రస నీరంధ్ర మహాంధ్ర పద్యకవితా రాజన్య లోకంబునం
దసమాన ప్రతిభాధురంధర మహీయస్సార్వభౌముండు మా
పసివాడీ కలుగోట్ల వంశ జలధి ప్రాలే య భానుండు,'' అనీ;

''కవితా నిష్ఠా గరిష్ఠుండు మాధ్వీక స్వచ్ఛ మరందమూర్తి'' అనీ అన్నారు యుగకవి గుంటూరు శేషేంద్రశర్మగారు.

''మీ కవితా ధార కాశ్చర్య ముగ్ధుడనయ్యాను'' అని ఆచార్య తంగిరాలగారు (బెంగుళూరు); ''ఈ రోజుల్లో తెలుగుదేశంలో ఇంకా మీలాంటి వారున్నారా?'' అని తిరుపతినుంచి మల్లంపల్లి శరభయ్యగారు అంటున్నారు.

''మీ కవిత పలురంగుల పూలతోట. పంచవన్నెల చిలక.'' అంటూ అభినందిస్తున్నారు నెల్లూరు నుండి ప్రముఖ రచయిత్రి డా.పి. జయప్రదగారు (వంశీ నర్సింగ్ హోమ్).

''నిజంగా నీ కవితలో ఏదో వింత ఆకర్షణ, సమ్మోహనశక్తి ఉంది విజయుడూ!'' అని అంటుంది డా. ప్రసన్నకుమారి.

ఇలా ఇలా ఎందరో ఎన్ని విధాలుగానో అభినందించి ఆనందించిన విజయాత్రేయ కవితల్లోని భాగాలు ఉటంకి వ్యాఖ్యానించటం అమాయకత ఔతుందని ఆ ప్రయత్నం విరమిస్తున్నాను.

'క.వి' గారిని గురించి శేషేంద్రుని మత్తేభం:

''దివికిన్ జేరిరి విశ్వనాథ ప్రభృతుల్ తెల్గున్ ప్రజానీకమున్
నవ కావ్యమ్ము లనేకముల్ మలచి యానందిపజేయంగ నీ
భువిపై నిన్ను ప్రతిష్ఠజేసి - విజయా! పూర్ణామృతంబైన నీ
కవితాచంద్రిక సోకి మూర్ఛిలితి నో కావ్యేంద్రజాలప్రభూ!''

నా పరిచయానికి భరత వాక్యం పలుకుతున్నాను. శ్రీ రాజరాజేశ్వరీ దేవి అమందాశీస్సుధాధారలు, కరుణా కంజాతాలూ, వాత్సల్య పారిజాతాలూ - నిరంతరం విజయాత్రేయనూ, అయన కుటుంబ సభ్యులనూ, కవితా కళావతినీ - అభిషేచించు గాక! శుభం భూయాత్!

(ఈ ప్రముఖ కవి కలుగోట్ల విజయాత్రేయగారు ఇటీవల స్వర్గస్థులయ్యారని చెప్పటానికి మిక్కిలి చింతిస్తున్నాం. ఈ వ్యాసం 'క.వి.' గారు సజీవులై ఉండగా వ్రాయబడింది. - సంపాదకులు)



వెన్నెల పొంగినట్లు, కనువేదురు పింఛము విప్పినట్లుగన్,
క్రొన్నన పూయు లేవలపు కూర్మలు గుండెల పిండినట్లుగన్,
కన్నెల నవ్వు జల్లుల దిగంతరముల్ పులకించినట్లుగన్,
వెన్న స్రవించునట్లుగ, కవిత్వము అల్లుదు నీవె ఓ కవీ!

మొగలి పొత్తు పొడులు, పొగడపూవుల తావి,
మల్లెమొగ్గ మనసు మార్దవమ్ము,
మధుర భారతీయ మంజీర మణితముల్
కలవు నీ కవిత్వ గళమునందు!

- నండూరి రామకృష్ణమాచార్య



# విశ్వనాథ విజయభేరి

- కలుగోట్ల విజయాత్రేయ

ఏ మహాకవి సముద్ధాయ ధీ నిర్ఝరి
సాహిత్య శాంకరి స్నానమాడె
ఏ మహాకవి కళారామ సుమపథాన
కవితా లతాంగి వైభవము మురిసె
ఏ మహాకవి ఆర్ష హేమాంగ ణమ్ముగ
వేద విజ్ఞానమ్ము వెల్లివిరిసె
ఏ మహాకవి వచో హిమశిఖరమ్ముల
నాంగ్ల భాషా యోష యాడు కొనియె
నట్టి ప్రతిభా ప్రతాప విద్యాప్రదీప
దివ్య భవ్య సంభావ్య సందీప్త ధౌత
కీర్తి నిస్తంద్ర పరధీ ప్రవర్తి విశ్వ
నాథ మేధా సనాథ శ్రీనాథ మూర్తి! 1

అఖిల కవితా ప్రక్రియల నియంత, నవర -
సాంధ్ర సాహిత్య జగతీ నియానుకుండు
విజయ సుశ్రీ విరాజి శ్రీ విశ్వనాథ
సత్యనారాయణ సుకవి చక్రవర్తి! 2

ఆంధ్ర కవితా మనోజ్ఞ రసార్ణవమ్ము
నవ్య సాహిత్య కచ్ఛపీ దివ్యవాణి
విరళ నవలా వినోది శ్రీ విశ్వనాథ
సత్యనారాయణ సుకవి చక్రవర్తి! 3

విశ్వనాథుని సాహిత్య విశ్వమంత
దేవమందార సౌరభోద్దీపితమ్ము
మధుర మాకంద మకరంద మందరమ్ము
నందనోదార బంధుర సుందరమ్ము! 4

కవితా మేరువు - సాహితీశరధి - దిగ్భామా శిరోరత్నమై
భవ కాంతిచ్ఛట - భావ నందన కళా ప్రాఘార కల్పద్రుమా
నవ కైసాలము - విశ్వనాథ రచనా న్యాసమ్ములాంధ్రావనీ
వివిధోదాత్త దిగంత విస్తర యశోవీచీ శరచ్చంద్రికల్. 5

తెలుగున్ దేశపు కీర్తి కేతనము - సాంద్రీభూత సారస్వతో
జ్జ్వల కల్యాణ కళా విలక్షణ మణీ సౌధాంతరానంద మం
జుల శయ్యాతలి - విశ్వనాథ కవితా సంస్కార మందార సం
చల సౌగంధీ మరంద బిందు లహరీ స్వారస్య సంపూర్ణతల్. 6

నింగికి నేలకున్ కవిగ నిల్చిన సుందర నవ్యసాహితీ
సంగర సార్వభౌముడు - ప్రసన్న మనోహర కావ్య భారతీ
భంగిమ లొల్కవోసిన దివాకర దీధితి - తెన్గువాణి వీ
రంగము విశ్వనాథ రసరాజ్యము - పల్కగ వాక్కు చాలునే! 7

శ్రీ రాజ రాజేశ్వరీ హేమ నూపుర
భ్రమర ఝుంకార మెవ్వాని వాణి
శారదా కచ్ఛపీ స్వర కళామాధురి
పచరించె నెవ్వాని పలుకు కులుకు
శివదేవు డమరువు చెలగి చిందిడినట్లు
రవణిలెల్ల నెవ్వాని తాకు రీకు
సురగంగ పరుగుల యురవడి పోద్రోసి
పడదూకె నెవ్వాని ప్రతిభ ఘనత
అట్టి కవి ఋషి గూర్చి వ్రాయంగ తరమె
ఆ మహానుభావుని కవితార్ణవమ్ము
తరచి చవిచూడ వలె నంతె - తగునె పలుక
నలువకయినను నవ్వాని చెలువ కయిన! 8

నవలా నాటక పద్య గద్య రచనా న్యాసంబు భాసింప, ప్రా
భవ పాండిత్య విశేష వీచికలు విభ్రాజిల్ల, నాంధ్రావనీ
వివిధానర్ఘమణీ ప్రవాళ విలసద్వీధీ విహారాల కెం
జిపురుల్ సాగిన విశ్వనాథ విబుధ శ్రీ నెన్న సామాన్యమే! 9

తెలుగున్ జాతికి, తెల్గునీతి, కటుపై, తెల్గున్ జగా కీర్తికిన్,
తెలుగున్ కైతకు, తెల్గు సాహితికి, క్రొందేనెల్ ఝరుల్ వారు నె
త్తళుకున్ కుల్కుల తెల్గు పల్కుబడికిన్ - దార్ఢ్యంబు సంధించి క్రొ
వ్వెలుగుల్ గూర్చిన విశ్వనాథ మహద్విస్ఫూర్తి నగ్గించెదన్! 10

# మీ చేతులు మాట్లాడుతున్నాయి

- ఏల్చూరి సుబ్రహ్మణ్యం

చిమ్మ చీకట్లో నా రెప్పల క్రింద నుంచి నిన్న
విమానం దూసుకొని వెళ్లినప్పుడు
రెండో ప్రపంచయుద్ధపు ఒక కాళరాత్రి జ్ఞాపకానికి వచ్చి

'ఆనాడు జర్మనీ గెలిచి ఉంటేనా స్వర్గాన్ని
జాతీయం చేసి ఉండేవాడు హిట్లర్' అనుకొన్నాను.

భగవంతుడు బొద్దంకి మీసాలు పెట్టుకొని
ఎట్లా ఉండాలో అట్లా ఉండేవాడు!

గుండె గుండెకూ ఎదురెదురుగా తుపాకి
ఊరూరి చుట్టూ ముండ్లతీగల కంచె
ఆలోచనకు బేడీలు పడి ఉండేవి
యుద్ధాలు చరిత్ర పుటపుట మీదనే కాదు
గోడ గోడమీద వేలిముద్రలు వేసి ఉండేవి
మనిషంటే మసిమసిగా కసిగా!!

అచ్చం మన నేతి బీరకాయ ఆనందమార్గ్‌లో పుర్రెల్లా
అరచేతిలోనే స్వర్గం కనిపిస్తుండేది
పట్టపగలు చుక్కలు పొడుస్తుండేవి
బడికి పోకుండానే పిల్లలకు చదువులు వచ్చేసి ఉండేవే మరి!
అదృష్టవంతులం మనం సంతోషించాల్సిందే
'ఆనంద' పోయాక వచ్చిన 'రాక్షస'
మనిషి చెయ్యగలిగినన్ని కిరాతకాలు చెయ్యలేదని అనిపించుకున్నాడు
'ఆర్యభట'ను ఎగురమని, శ్రీహరికోట మీదనుంచి
అంతరిక్షానికి పోవడానికి మనకు నిచ్చెన వేశాడు!
కనీసం కనబడే అన్యాయాల్ని, అవ్యవస్థను
మెరుపులా ఎదుర్కొంటున్నాడు.
పనిదొంగల్ని, లంచమిస్తే మంచమెక్కుతాననే మహానుభావుల్ని

గోముఖ వ్యాఘ్రాలను
ఒక్కొక్కళ్ణే లాక్కొస్తున్నాడు వీథిలోకి:
చెప్పులోని రాయి, కంటిలోని నలుసు, చెవిలోని జోరీగల్ని
గురిగింజలం మనం చూసుకోని మన వొంటి మీది నలుపును
అద్దంపట్టి చూపుతున్నాడు!
ఇంతకు కాస్తముందర మేరు మందరాలు ఢీకొన్నట్టు
అలలయి లేచిన ఆ చప్పుడు
ఓడలను భయపెట్టిన ఆ తుఫానును చీకటిని
చీల్చి ఏకి పారేశాయా అర్కసహస్రాలు?

వినాయకుని బొజ్జలో వేలుపెట్టి నవ్వండ లేదుకదా
మనలో ఒక్కొక్కళ్లము?
బిడ్డలను చంకకెత్తుకొని బేలచూపులు చూస్తున్నారే తల్లులు
ఓడ మునిగినా ఈదగలిగినవాళ్లు ఎందరు?
తైతక్కలాడడం లేదు కదా మన నావికులు
జాగ్రత్త - మృత్యువక్త్రం తెరుస్తున్నది
హిందూ మహాసముద్రం నేడు

కాదు --
భావి పూర్ణచంద్ర వీక్షణావేశంతో
వీచికలై లేస్తున్నారు ప్రజలు -
పులకితమయిన అయోధ్యులు
ప్రేమలాగ ఎక్కడ ఉన్నామో
ఎందుకున్నామో గమనించలేము - ఏవీ?
చూశారా మీరు కొట్టుకొట్టు ముందరి ధరల వరలు?
ఏమిట వింటున్నారు లెమ్మని ప్రశ్నలడగడం
కాదు - నాలాగే మీరూ సమస్యల తూణీరాలని నాకు తెలుసు.
వాన రావటానికి ముందు
చీమలు పుట్టలనుంచి బారులు బారులుగా వచ్చినట్టు
మన ప్రశ్నలు బైటికి వస్తే పరిష్కారపు కండచక్కెర దొరకవచ్చు!

మనము ఎవళ్లము -

ఒక తల్లి కడుపున పుట్టినవాళ్ళం
ప్రశ్నల్లాగే మన ఆలోచనలు ఒక దిశకు వస్తే చాలు.
అప్పుడే నిద్రా పరిమళదుస్తుల్ని వేసుకోలేదు కదా మీరు
ఆ నిద్రా, మృత్యువు మన చుట్టూ తిరుగుతుండే రాబందులు
వాటికి కాస్త దూరంగా ఉంటే...
మీరనుకునే మంచినీ, ఇతరులకు చేతకానిది
మీరే చెయ్యగలిగినది చేసి చూపగలుగుతారు
అంతరంగ మందాకిని రత్నాకరు పొందు చేరినట్టు
ఒక్కమాట -
నన్ను పెంచి పెద్దచేసిన తండ్రి
ఆసుపత్రిలో కన్నుమూసినప్పుడు
'ఏడీ పిల్లవాడు వస్తే బాగుండేది ఒక్క ముక్క చెప్పటానికి'
అని అన్నాడట అమ్మ చెబుతుంది
'నువ్వు పక్కనే ఉంటే మీ నాన్న బ్రతికేవాడని'
ఆనాడు ఆఫీసులో పని తెమలక
అక్కడే కూరుకొని పొయ్యాను నేను.
చిన్నప్పుడు నాకు నూలు మొలత్రాడు
చేసి యిచ్చిన 'నారయ్య' పుగాకు కాడ కొనిపెట్టమంటే
'అదేమిటి నారయ్యా, నీకు కొండమీది కోతిని తెచ్చివ్వగలను
ఈమాటు 'హవానా' చుట్టలపెట్టె తెచ్చిస్తాను
మద్రాసునుంచి దొరలు కాల్చేది' అంటేనే
సంబరపడ్డాడు ఏనుగనెక్కినట్టు.
మొన్న యాన్యువల్ లీవ్ తీసుకొని
చుట్టల 'బాక్స్' కొనుక్కొని వెళ్లేసరికి
పాపం నారయ్య లేడు
ఎవరికి కావాలి, నా సాయం కావలసిన వాళ్లు
దాటిపొయ్యారు.
'నువ్వు చెయ్యగలిగిన మంచిపని తక్షణం చెయ్యాలి'
వాయిదా చెయ్యకండి ఇట్లాంటివాటిని.

నాకు తెలుసు మీరు లోపాలను సహించలేరని

సమాజం ఎటుపోతున్నదీ ఎరుగుదురు మీరు
మీ దస్తూరి నా దస్తూరికన్న బాగుంటుంది
మీలో ఒకరు - పదాన్ని, అటువులా బద్దలుకొట్టి
లోకానికి కౌముది కాయిస్తారని నాకు తెలుసు
మిమ్మల్ని స్పందిస్తే ఒక్క 'పలుకు'
- కదుల్తుంది దేశం!

మీ చేతులు మాట్లాడుతున్నాయి
పసివాడి జుట్టు మెత్తగా నిమిరినప్పుడు
పంటకోసి కళ్లం వేసినప్పుడు
అన్నినీళ్లు తోడుకొచ్చి క్రింద కుమ్మరించండి
సూర్యుడు, చంద్రుడూ పిలిచినట్టు దిగివస్తారు!
రేలు కురచలయితే పగళ్లు పొడవు
వర్తమాన కాలం శరీరంమీద
కొట్టబడుతున్న మేకులు భళ్లున జారిపడవే
నిట్టూర్చినా, ఎగ ఊపిరి పీల్చినా, నవ్వినా మీరు
దిక్కు దిక్కులకూ వినిపిస్తుంది ఇది ప్రతిధ్వని శకం
ఇది స్నేహశకం

భయంలేదు నిటారుగా మనం నిల్చుంటే చాలు
నిన్నటి తప్పులతో ఇవ్వాళటిని కొలవకండి
కొలతలూ కలతలూ కాలాన్ని పట్టలేవు
లోలోతుల నుంచి బయటకు తెస్తున్నదెవరు
నిధి నిక్షేపాలను?
ఇంటి దొంగలను, మింటి దొంగలను
ఆడనిచ్చే ధృతరాష్ట్రులను మనము
మన మనుగడను పంకిలం చెయ్యనివ్వము
మన తరంలోనే భారతం
ఎన్నుకున్నది స్వతంత్రాభివృద్ధి పథం
ఎవరాపగలరు దీన్ని?
ఆపేందుకు ప్రయత్నించిన ప్రతీప శక్తుల ఒత్తిడులను
ప్రతిఘటిస్తూ పురోగమిస్తుంది దేశం

కన్నగడ్డ కలిమికి, బలిమికి పాదులు చేసి
స్వేదోద్భవ పినాకినులను మళ్లిస్తున్న తరం మనది
నూలుపోగుమీద నడుస్తున్న మనుషుల
చిటికెన వేళ్లమీద అవిగో గొడుగులు -
గోవర్ధన పర్వతాలు!

26 AUG 1975
(ఇది ఏల్చూరి అముద్రిత కవిత)



# కన్నమభూమి

- ఆశావాది ప్రకాశరావు

సీ॥ షట్పదీ సంవృత సహకార భారత
కవి కుమారవ్యాసు గడన భూమి
వచన వాఙ్మయ మహాప్రస్థాన నారదు
ఘను పురందరదాసు గన్న భూమి
మహిళా శిరోమణి మహిత సద్గుణ ఖని
అక్కమహాదేవి యమల భూమి
స్ఫాయద్యశస్కుఁడౌ రాయల తేజమ్ము
మూర్తిమంతంబైన పుణ్యభూమి
జీవకళలకు కుదురైన దేవళమ్ము
భక్తి భావాలు నేర్పెడు పాఠశాల
ప్రకృతి సోయగమ్ముల కాట పట్టునైన
కన్న కర్ణాట దేశ విఖ్యాతి నెంతు



# పలుకే బంగారం!

- పోచిరాజు శేషగిరిరావు

ఎప్పుడు పల్కెదో! యెరుక యేమియు దోపదు - లోవెలుంగులన్
నవ్వుచు చిమ్ముచుందువు సనాతన తేజము - యోగధారలన్
చప్పుడు చేయకుండగనె చల్లగ చల్లెదొ స్వామి! దీక్షమై
అప్పులు తీర్చగల్గుదునొ! అట్టె ఋణంపడి యుందునో ప్రభూ! 1

విప్పిన కంటి జంట కనువేదురుతో నినుజూడ కోరికా,
ఎప్పటికైన నా కల ఫలింపగ జేయుదె! తర్కపున్ ముడుల్
విప్పుచు, నిట్లె జాతకము వేదనలన్ భరియించుచుందునో!
విప్పవు వాతెఱన్, చెవుల విందుగ పల్క విదేమి చిత్రమో! 2

జాయను కొంటివా? కదలరాని తనమ్మున నట్టెయుంటకున్
ప్రాయపు ప్రొద్దు వ్రాలెనని ప్రక్కకు నెట్టితివా? రసజ్ఞతా
శ్రీ యిసుమంత రాల్చవె పసిండి దొరా! జడురీతి నీ పద
శ్రీ యుగళమ్ము పట్టితి, తరింతునె జన్మ పరంపరార్బ టిన్ 3

చల్లని నీ వచస్సుధ ప్రసర్పణ సేయవె! కాంతివాహినీ
వల్లభ! లోకమోహన దివస్పతి! భాసుర భవ్య భారతీ
ఫుల్ల సరోజ గంధ పరిపూత లస ద్వియ దంతరిక్ష వి
ద్యుల్లతి కాలవాల! రసతుందిల జాల! చిదాత్మ వైభవా! 4

ఒరయగ నిన్ను తర్కనికషోపల ధారల శక్తి లేదు - ని
న్నరయగ దేశదేశముల యందలి దైవ నివాసభూములన్
దిరుగగ నేర - కావ్య రస తీర్థములన్ నిను ముంచ లేను, సం
స్మరణ మొనర్చుటే బ్రదుకు సర్వమునాకు పొనర్చినాడవో! 5

నీ పద ధూళి సోకి యవనీ తల మంత, వినూత్న కాంతిరే
ఖాపరిదీప్తమై, పర సుఖమ్ములు రాసులు వోయు - తద్గుణ

ప్రాపిత భావనా పటిమ రాజస భావము త్రోసిరాజు నౌ,
ఊపిరి తీయ నిన్నె గని యూరట నొందుదు! డిందు వేదనల్ 6

ఊరక యుండ దీ యెడద, యొప్పుగ నిశ్చల తత్త్వచింతనా
సారము గ్రోల, కేదొ సర సమ్ములు పల్కుచు, నుబ్బిపోయి, యం
దే రమియించు లోక మదియే యయినట్లు లనారతమ్ము - ప్ర
జ్ఞా రుచి రానుమేయ! గుణ సాగర! నా కొక త్రోవ చూపవో! 7

పలికితి వెన్ని యేళ్ళకు ప్రభా పరిలిప్త మహానుభావ! చే
రలగొని త్రావెదన్ మనసు రంజిలు నంతకు తద్రసమ్ము, లో
వెలుగులు చూరలీయ, పృథివీ రుచులన్నియు జారిపోవ, ని
ర్మలమయి అంతరాంతర చిరంతన మార్గములున్ స్ఫుటమ్ములౌ! 8



# సాహితీ వసంతుడు

- ఆశావాది ప్రకాశరావు

సీ॥ అన్నమాచార్యుల అక్షయ ధనరాశి
వినుత పరిశ్రమల్ వెలికి తీసె
వేమన్న పద్యాల విశ్వాత్మ దర్శించి
తెలుగు విమర్శకు విలువపెంచె
సప్తశతీ కృతి సౌరభ శృంగార
మాంధ్రికి కాన్కగా నందజేసె
పెనుకొండ కీర్తికి ఘనదర్పణంబుగా
మేటి రాగము తోడ పాట వ్రాసె

రాళ్లపల్లి వంశ రత్న వీణియపైన
తానవంత రాగ తానములను
కృష్ణ శర్మదొక్తి కేళిమీటినయట్టి
సాహితీ వసంతుని ప్రశంస జేతు



# కలత పడ్డ ప్రతిబింబాలు

- సౌభాగ్య

ఊహల్ని తొడుక్కుంటూ పోతే
బతుకంతా పూల విత్తనాలు చల్లుతున్నట్లే
వందేళ్ళ నాటి పేజీల మధ్య బ్యాక్టీరియాకు లొంగని
దోమ శవానికి చరిత్రలో చోటుండదా?
చేతికి అందిన సీతాకోక చిలుకల్లా పూలపై పిల్లంగోవీలు వూదుకుంటూ
రహస్య గమనం చేద్దాం
అశాంతి మన ఆలోచనల్ని వెలిగించే కాంతి
నిరాశ లోయలోకి విరిగిన వంతెన
సరాసరి లోయలోకే దూకుదాం
మ్యూజియంలోని ఆదర్శాన్ని ఎవరూ సందర్శించడానికే ఇష్టపడ్డం లేదు.
ప్రతి రోజూ భూమికి సూర్యుణ్ణే దిష్టి తీసి కొండల వెనక పడేసినా
భూగోళాన్ని నాకుతున్న తోడేళ్ళ బెడద తప్పడం లేదు,
ఒక అంగవైకల్యం విదియ చంద్రునిలో అందమవుతుంది.
చేతుల్లేని, కాళ్ళు లేని
తలల్లేని మొండాలు
నవ్వే తలలు, కదిలే చేతులు, పరుగెత్తే కాళ్ళు
అడుగడుగునా నన్ను తాకుతూ....
కలత పడిన నీటిలో ప్రతిబింబాలు గాయపడతాయి.
ఆగిపోయిన ఆలోచనల్ని
దాక్కున్న శిలల్ని
డైనమేట్లు పెట్టి పేల్చేస్తాను
విస్ఫోటనంలోంచి వొచ్చిన విరూపాక్షుడు
వికటంగా నవ్వుతూ నన్ను మింగేస్తాడు!



# బషీర్ మినీ కవితలు

## 1 భార్య

జీవితం
ఒక వైకుంఠపాళి
కొందరికి భార్య నిచ్చెనైతే
మరికొందరికి పెద్ద పాము

## 2 లంచం

అందరిలో ఇస్తే
అసహ్యించుకుంటాం
ఒంటరిగా దొరికితే
కౌగలించుకుంటాం

## 3 ఆసుపత్రి

ఆసుపత్రి కూడ
యుద్ధ భూమి లాంటిదే!
అక్కడా! ఇక్కడా
దిగేవి - గోలీలే!
అయితే
అక్కడ నోట్లోకి!
ఇక్కడ ఒంట్లోకి!

## 4 గ్యారంటీ

పదివేలు ఇచ్చి కొన్న 'ఫ్రిజ్'కి
ఏడు సంవత్సరాల గ్యారంటీ!
లక్షలిచ్చి కొన్న వరుడికి
ఉందామరి ఆ గ్యారంటీ!

## ''ఓ చిరునవ్వు''

- పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం

ఆమె ప్రకృతి
అతడి తోట జీవనపథంలో
అడుగడుగునా అతడు చేసే విశ్వామిత్రం
ఆమెకు తెలుసు - కానీ ఆమె తూష్ణీభావం
అతడెన్ని జన్మలెత్తినా అతని కర్థం కాదు
అతడెల్లప్పుడూ తన అవయతా బుద్ధితో
తన అల్పత్వం చాటుతుంటాడు. ఆమె తొణకదు
కదిపితే, కనలిస్తే ఆమె చీకటి పురి అవుతుంది
సర్వాంగీణ రసామృత స్తిమితమై అనుక్షణం
నెత్తావి కదంబించే ఆమె శరీరం
మగవాడి మదాంధ దృష్టికి కేవలం
ఎత్తుపల్లాల కండరాలు మాత్రమే - కానీ
కందర్పజగంలో - ఆ మహా సంగరోర్విలో
అతడు తనదే గెలుపనుకుంటాడు ఎప్పుడూ
కానీ అతడికి తెలియదు
ప్రణయం ఆమెకు సిద్ధ సారస్వతం అని
ఆమె తన అత్యుల్లసిత భంగి చేత
అత్యద్భుత ప్రౌఢి చేత - అతడి గుండెలపై
గెలుపు జెండా పాతుతుంది
కేవలం నరాల సలుపుడు నుండి మాత్రమే
అతడు విముక్తుడవుతాడు
ఆమె మాత్రమే నిజమైన ఆనందపు పరాంకోటి నందుకుంటుంది
ఆ ఆనందంలో లాలసతో పాటు
కొంచెం ఆధ్యాత్మిక సౌరభం
కించిత్ యోగ సమాధిలోని నిశ్చలతా, నిర్వికారతా
మిళితమై ఉంటాయి.
ప్రకృతి ముందు అతడి సామర్థ్యం హుళక్కి అవుతుంది

అతడింకా ఆమెను అర్థం చేసుకునేంతలో
ఆమె మాతృత్వపు మహాద్భుత ప్రపంచపు
వాకిళ్ళు తెరుచుకుని వెళ్ళిపోయుంటుంది
అతడిక్కడే ఆమెను మాయ అని భ్రమిస్తుంటాడు
ఆ తర్వాత తన మనస్సుతో ఆమె మనస్సును
ముట్టుకోలేడు
స్మర శర వేదరహస్యం
ఈ జీవన రహస్యం తెలిసిన ఆమె
తన మగాడి ముందు ఆ రహస్యాన్ని
చూపుల్తోనే విప్పుతుంటుంది అహర్నిశం
కానీ ఆమె కళ్ళ సంకేతం అందుకోలేక
సతమతమవుతుంటాడు అతడెప్పుడూ
అతడి అన్ని అనుమానాలకీ
అతడి అన్ని అసమర్థతలకీ
అతడి అన్ని అల్పత్వాలకీ
ఆమెదొక్కటే జవాబు
ఒక చిరునవ్వు!



## శాపము

నవ వసంత శుభోదయానంద వశతc
బ్రకృతి నూతన జీవలావణ్య మొంద
జాయి అప్పయుc గంఠస్వంబుc దాల్చి
నైజ గుణముc ద్యజించి గానంబు సేయc
బికమ, పాడకుమనుచు శపించినారు!

- కృష్ణశాస్త్రి

# కవితా వార్త:

## మలయాళ రచయిత్రి బాలమణి అమ్మకు
## 'సరస్వతి సమ్మాన్' అవార్డు

హైదరాబాదు, డిసెంబరు, 10:

భారతీయ భాషలలో అత్యంత విశిష్టమైన సాహిత్య రచనకుగాను ప్రతియేటా అందించే ప్రతిష్ఠాకరమైన 'సరస్వతి సమ్మాన్ అవార్డు'ను 1995 వ సంవత్సరానికిగాను శ్రీమతి ఎన్. బాలమణి అమ్మకు ప్రకటించారు. మలయాళంలో ఆమె రాసిన 'నైవేద్యం' కవితల సంకలనానికిగాను ఆమెకు ఈ అవార్డును ప్రకటించారు. ఈమె 'నైవేద్యం' కవితల సంకలనాన్ని 1987లో ప్రచురించారు. మలయాళ భాషలో ప్రచురించిన పుస్తకాన్ని బహుమతికి ఎంపిక చేయడం ఇదే మొదటిసారి. అవార్డు కింద 3 లక్షల రూపాయల నగదును అందజేస్తారు.

దేశంలో మరే అవార్డు కింద ఇంత పెద్ద మొత్తంలో నగదు బహుమతిని అందజేయడం లేదు. కె.కె. బిర్లా ఫౌండేషన్ నెలకొల్పిన ఈ అవార్డును గత పదేళ్లలో ప్రచురించిన ఉత్తమ సాహిత్య రచన లన్నింటినుంచి ఏరి ఎంపిక చేస్తున్నారు. గతంలో 'సరస్వతి సమ్మాన్' అవార్డును పొందిన వారిలో డాక్టర్ హరివంశరాయ్ బచ్చన్, శ్రీ రమాకాంతరథ్, విజయ్ టెండూల్కర్, డాక్టర్ హర్‌భజన్‌సింగ్ ఉన్నారు.

(- ఆంధ్రప్రభ దినపత్రిక, బెంగుళూరు, సోమవారం, 1995 డిసెంబరు 11)

మలయాళీ కవిత

# ఎన్. బాలమణి అమ్మ

## ప్రేమతో మా అమ్మాయికి-

ఎక్కడో దూరంగా... మంచులాంటి
తెల్లటి ఆసుపత్రి పడక మీద - మా అమ్మాయి!
ఏమ్మా నీ నొప్పుల బాధల నల్లటి దారాలతో
అర్ధరాత్రి కటిక చీకటిని ఉషోదయంగా నేస్తున్నావా తల్లీ?

విచారిస్తే వెందుకూ?
ఎప్పుడైతే మనం తొణికిసలాడే జీవంతో ఆరాటపడి
అలసిపోతామో, అప్పుడొకింత విశ్రాంతి తప్పదు -
ఆ భగవతి ఆ సృష్టికారిణి మనకింత అస్వస్థతను ప్రసాదిస్తుంది
భక్తితో స్వీకరించాలి. పడకేయాలి. బాధపడాలి. కోలుకోవాలి.
ఒక కొత్త తేజంతో, నవనవోన్మేషంగా నిలబడాలి!
మనం ఎక్కాల్సిన విజయాల మెట్లు ఎన్నున్నాయో
మనకెట్లా తెలుస్తుంది చెప్పూ?

ఇంటి ముందు, మంచుతో తడిసిన లాన్లో...
నీ కవితలు చదువుతున్నప్పుడు
నాకు నిజంగా ఆశ్చర్యం వేసింది-
నాలో మొగ్గలా పెరిగిన నీ శరీరం కన్నా,
విచ్చుకునే పువ్వుకు చిరు దరహాసాన్నందించే
నీ కవితాభావనే నిన్ను అతిగా బాధించిందా?

నువ్వు నిద్రబుచ్చిన ఈ సిల్కు దారపు గూళ్ళు
పగిలి, పురుగులు బయట పడ్డాయి.
వాటికి చిన్ని చిన్ని రెక్కలు మొలిచి,
నా మెదడంతా కదలాడాయి
విచారకరమైన ఆలోచనలతో నీ మనసు విచలితమై ఉండొచ్చు
ఇంటి పనితో, ఈతిబాధలతో నీ శరీరం పచ్చి పుండై ఉండొచ్చు
అయినా నీ గురించి నాకు భయం లేదు-
పురుగుల్ని సీతాకోక చిలుకలుగా మార్చే
నీ శక్తి అపారం, అద్వితీయం
అది నాకెంతో హాయినిస్తుంది!

(ఎన్. బాలమణి అమ్మ 1909లో పుట్టారు. మాతృభూమి మేనేజింగ్ ఎడిటర్ కీ.శే. వి.యం. నాయర్‌కు భార్య. ఇండో ఆంగ్లికన్ కవయిత్రి కమలాదాస్‌కు (మాధవీ కుట్టి) తల్లి. కేరళ సాహిత్య అకాడెమీ, కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డులు అందుకున్నారు. 'సాహిత్య నిపుణన్' అనే బిరుదుతో సత్కరింపబడ్డారు. వీరి కవితల ఆంగ్లానువాదాలు 'థర్టీ పోయెమ్స్'గా ఓరియంట్ లాగ్మన్ ప్రచురించింది. ఇటీవల ''సరస్వతీ సమ్మాన్'' పొందిన సందర్భంగా చైతన్య కవిత వీరిని అభినందిస్తూ, ఒక పర్సనల్ పోయెంను ప్రచురిస్తోంది)

అనువాదం: డా॥ దేవరాజు మహారాజు

# సాహిత్య వార్తలు

**1. ''అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్ (U.S.A) ప్రతిభామూర్తి అవార్డు''**

ప్రముఖ కథానికా రచయిత డా॥ మధురాంతకం రాజారాం గారికి జనవరి 14వ తేదీని విజయవాడలోని తుమ్మలపల్లి వారి క్షేత్రయ్య కళాక్షేత్రంలో జరిగిన సాహిత్య సభలో ''అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్ (అమెరికా)'' వారి ''1996వ సంవత్సరపు ప్రతిభామూర్తి'' అవార్డు లభించింది. (50 వేల రూపాయలు)

**2. ''కళాసాగర్ అవార్డు'' (మద్రాసు)**

మద్రాసులోని కళాసాగర్ వారు ఏటా ఇచ్చే పురస్కారం ఈ సంవత్సరం సాహిత్యవేత్తలకు ఇచ్చారు. వారిలో ప్రముఖ పరిశోధకుడు, కవి, అధ్యాపకుడు, తెలుగు సాహిత్య కర్త అయిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి (విశాఖ పట్టణం)గారొకరు.

**3. చాసో స్ఫూర్తి సాహితీ పురస్కారం (తిరుపతి):**

చాసోస్ఫూర్తి సృజనాత్మక సాహిత్య ట్రస్టు (తిరుపతి) వారు తమ ద్వితీయ సాహిత్య పురస్కార ప్రదానోత్సవం జనవరి 17వ తేదీని మద్రాసులో జరిపారు. ప్రముఖ అభ్యుదయ కవి, సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర నిర్మాత అయిన ఆరుద్రగారికి ఈ పురస్కారాన్ని ఇచ్చి సత్కరించారు.

**4. నన్నయ భట్టారక పీఠం (తణుకు) వారి శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు పద్య కవితా పురస్కారం:**

శ్రీ నన్నయ భట్టారక పీఠం (తణుకు) వారు నిర్వహించిన శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు పద్య కవితా ఉత్సవ గ్రంథ బహుమతి, హనుమకొండ వాస్తవ్యులు, కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు అయిన డా॥ అనుమాండ్ల భూమయ్యగారు రచించిన ''వెలుగు నగల హంస'' అనే కావ్యానికి లభించింది. ఆచార్య చేతవోలు రామబ్రహ్మంగారి అధ్యక్షతన జరిగిన నన్నయ భట్టారక పీఠం సాహిత్య కార్యక్రమంలో భూమయ్యగారికి నగదు బహుమతి, ప్రశంసాపత్రం, జ్ఞాపిక, శాలువ బహూకరింపబడ్డాయి.

**5. ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారి సహస్ర పూర్ణ చంద్ర దర్శనోత్సవ సభ (తిరుపతి):**

ప్రముఖ సాహిత్యవేత్త, సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడు, కవి, పరిశోధకుడు, ఉత్తమ ఆచార్యుడు, అయిన డా॥ జీరెడ్డి చెన్నారెడ్డిగారికి 31-1-1996 నాడు తిరుపతిలో బంధువులు, మిత్రులు, శిష్యులు అంతా కలిసి సహస్ర పూర్ణ చంద్ర దర్శనోత్సవ సభను నిర్వహించారు. ఈ సందర్భంగా శ్రీయుతులు తంగిరాల సుబ్బారావు, ఎల్.బి. శంకరరావు, నరాల వీరయ్య తదితర శిష్యులు కలిసి, శ్రీకృష్ణ కర్ణామృతంలోని 108 శ్లోకాలు ఏర్చి కూర్చి ''మరకత మణిమాల'' పేరుతో తమ గురువుగారికి బహూకరించారు.

**6. ఆచార్య తిమ్మావఝుల కోదండరామయ్య (1926-1981) స్మారక సాహిత్య పురస్కారం (తిరుపతి):**

ఇటీవల తిరుపతిలో శ్రీయుతులు సింగరాజు సచ్చిదానందం, తంగిరాల సుబ్బారావు, తిమ్మావఝుల త్యాగరాజమూర్తి, కామిశెట్టి శ్రీనివాసులు - ఇత్యాది మిత్రులంతా కలిసి ''తిమ్మావఝుల మిత్రమండలి''గా ఏర్పడ్డారు. వీరు ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 2వ తేదీనాడు, అంటే కోదండరామయ్యగారి జన్మదినం నాడు తిరుపతిలో ఒక సభ జరిపి, ఆ సభలో ఒక ప్రముఖ సాహిత్య పరిశోధకుణ్ణి సత్కరించాలని నిర్ణయించారు. ఫలితంగా 1994వ సంవత్సరానికి ఆచార్య జీరెడ్డి చెన్నారెడ్డిగారికీ, 1995వ సంవత్సరానికి డా॥ పోచిరాజు శేషగిరిరావు (హైదరాబాదు) గారికీ 'తిమ్మావఝల సాహిత్య పురస్కారాలు' 2-2-1996 నాడు తిరుపతిలో జరిగిన సభలో ఇవ్వటం జరిగింది.

**7. సహస్రావధానాలు (తిరుపతి- హైదరాబాదు):**

'సరస్వతీపుత్ర' డా॥ మేడసాని మోహన్‌గారు, జనవరి 4-21 తేదీలలో తిరుపతిలోను, 'అవధాన సహస్రఫణి' శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారు ఫిబ్రవరి 1-21 తేదీలలో హైదరాబాదులోను సహస్రావధానాలు నిర్వహించి కవి పండిత లోకాన్ని ఆశ్చర్యచకితుల్ని చేశారు.

**8. తంగిరాల సాహిత్య పీఠం (బెంగుళూరు)**

ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారు 31-10-1995 నాడు పదవీ విరమణ చేసిన సందర్భంగా వారి కుటుంబ సభ్యులు 'తంగిరాల సాహిత్య పీఠం' పేరుతో ఒక సంస్థను ఏర్పాటుచేశారు. ప్రతి సంవత్సరం ఉగాదినాడు ఈ క్రింది సన్మానాలు చేయాలని తీర్మానించారు:

1) కీ.శే. దిగుమర్తి సీతారామస్వామి స్మారక సాహిత్య పురస్కారం - ఉత్తమ విమర్శకునకు
2) ఆచార్య పింగళి లక్ష్మీకాంతం స్మారక సాహిత్య పురస్కారం - ఉత్తమ పద్యకవికి
3) ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య స్మారక సాహిత్య పురస్కారం - ఉత్తమ పరిశోధకునకు
4) కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ స్మారక సాహిత్య పురస్కారం - ఉత్తమ వచన కవికి
5) శ్రీ తంగిరాల వేంకటకృష్ణ సోమయాజులు సాహిత్య పురస్కారం - ఉత్తమ వక్తకు
6) కీ.శే. తంగిరాల సీతామహాలక్ష్మి స్మారక సాహిత్య పురస్కారం - ఉత్తమ జానపద సాహిత్య పరిశోధకునకు

ఈ సాహిత్య పురస్కారాలు కాకుండా ప్రతి సంవత్సరం శ్రావణ పూర్ణిమ నాడు కీ.శే. తంగిరాల వేంకట సుబ్బావధానులు స్మారక వేదపండిత సత్కారం కూడా నిర్వహిస్తారు.

## 9. జ్ఞానపీఠ బహుమతి:

1995వ సంవత్సరపు జ్ఞానపీఠ బహుమతి ప్రసిద్ధ మలయాళ రచయిత శ్రీ ఎం.టి. వాసుదేవన్ నాయర్‌కు లభించింది. ఈయన మాతృభూమి గ్రూప్ ఆఫ్ పబ్లికేషన్స్ సంపాదకుడు. భారతీయ భాషా సాహిత్యానికి ఎనలేని సేవలందించిన వారికి ఈ అవార్డు బహూకరిస్తారు. 1975-94 మధ్యకాలంలో నాయర్ అందించిన సృజనాత్మక సాహిత్యానికిగాను ఆయన్ని 31వ జ్ఞానపీఠ అవార్డుకు ఎంపిక చేశారు. కేరళలో 'ఎం.టి.'గా ప్రసిద్ధులైన నాయర్ మొత్తం 8 నవలలు, 16 చిన్న కథలు, ఒక నాటిక, రెండు ట్రావలర్స్ రచించారు. ఆయన రచన 'రందమూళమ్' (భీముడు పాత్ర ఆధారంగా) విశేష జనాదరణ పొందింది. నాయర్ స్క్రీన్‌ప్లే రచయితగా ఎన్నో అవార్డులు అందుకున్నారు. ఈ అవార్డు లభించిన కేరళీయుల్లో నాయర్ నాలుగోవారు. ఈ అవార్డు కింద రెండున్నర లక్షల రూపాయల నగదు, వాగ్దేవి కాంస్య విగ్రహం, ప్రశంసా పత్రం ఆయనకు లభిస్తాయి.

'సరస్వతీ సమ్మాన్', 'జ్ఞానపీఠ బహుమతి' రెండూ కూడా 1995లో మలయాళ సాహిత్యాన్నే వరించడం ఆభాషా రచయితల ఆశ్చర్యకరమైన విజయంగా భావించి వారిని అభినందిస్తున్నాం.

- సంపాదకులు

APPENDIX

## CHILD PRODIGY

# TWO POEMS OF MASTER P. SANJAY

### 1. Who am I ?

I am the king of the sky
who is so high
who am I?

They say I am a star
Who is so far
Who am I?

I chase the night away
To make a bright day
Who am I?

I give you light
Without me it is night.
Who am I?

During the day I shine
You use the energy of mine
Who am I?

(Master Sanjay wrote this poem on 20th November 1995, after hearing about the complete Solar Eclipse from his father Sri C.G. Putappa. The complete Solar Eclipse occured on 24th November 1995 i.e. on Deepavali Day.)

## 2. The Beautiful World

The world is nothing but nature,
Without it there is no future.
There are sun, moon, and beautiful stars,
Which are very far and far.
In this world there are trees and plants,
And little creatures like tiny ants.
In this world the lion is the King,
Whose roars are like thunder rolling.
In this world the flowers bloom,
Bringing bees from their honey comb.
This world will exist only a few days
If we keep on destroying it in all ways.
Without this beautiful nature
There is a dreadful future.

(29-12-1995)

(Master P. Sanjay is only 11 years old. He is studying VI class in Flolence English School in Basaveswara Nagar, BANGALORE 560 079. In addition to composing poetry, Master SANJAY is good in painting, singing, dancing and acting and also writing playlets is English. Recently he wrote a playlet called "SANGOLI RAYANNA" a freedom fighter of 19th century in Karnataka, and acted in it as "Thackery". Master SANJAY is the grandson of Prof.T.V. Subba Rao and Prof. C. GANGAPPA.)

# లేఖా చైతన్యం

(చైతన్య కవిత - 19 & 20 సంయుక్త సంచిక కవయిత్రుల ప్రత్యేక సంచిక. ఇది 1995 నవంబరులో వెలువడింది. దీనిని చదివి ఇద్దరు కవయిత్రులు పరస్పర విరుద్ధంగా స్పందించారు. వారి లేఖలు దిగువ ఇస్తున్నాం. - సంపాదకులు)

1

విశాఖపట్నం
96 జనవరి

ఆదూరి సత్యవతీదేవి
50-52-2, సీతమ్మధార, విశాఖపట్నం - 530 013.

శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావుగారికి,

నమస్కారాలు,

మీరు పంపిన 'చైతన్యకవిత' పుస్తకం అందినది. ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి పెద్ద ఎత్తున మీరు చేస్తున్న సాహితీసేవకి చిన్న మాటలు ప్రశంసలు కురిపించటం ఏ విధంగానూ భావ్యంకాదని తెలిసినా-

ఎక్కడెక్కణ్ణించో ఏరి తెచ్చి నిండుగా దండకట్టి, కవయిత్రుల చైతన్యాన్నొక చోట చేర్చినందుకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకోవాలని ఇలా నమస్కారాలతో

- ఆదూరి సత్యవతీదేవి.

2

Dr. A. Jaya prabha,
''లోహిత''
Plot No: 23, Sainik Enclave
Sainikpuri (P.O), SECUNDERABAD - 500 094

హైదరాబాద్
4th Jan '96

తంగిరాల సుబ్బారావుగారికి!

మీ కవయిత్రుల సంచిక అందించి, చదివాను. నిజం చెప్పనా! ఒక్క తెలుగు కవితా సంతృప్తి నివ్వలేదు నాకు. ఆశ్చర్యం!! కన్నడ కవితలకి సుందరంగారి అనువాదమూ..., We sinful womenకి మీరు చేసిన అనువాదమూ బాగానే వచ్చాయి. ఇంతకీ, కన్నడ, ఉర్దూ కవితలే నాకు ఎక్కువ నచ్చాయి. ఈ కవయిత్రుల సంకలనంతో మీ ఆసక్తీ, పఠాభి కోరికా రెండూ మొత్తానికి నెరవేరా యన్నమాట! కంగ్రాట్యులేషన్స్-

- జయప్రభ

# చైతన్య కవితా వేదిక

## బెంగుళూరు

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి. పట్టాభిరామరెడ్డి (పఠాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి.కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు ఐ.ఏ.ఎస్. |
| | | శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి |
| | | శ్రీ కె.పి. రావు |
| | | శ్రీ వై.వి. వెంకటేశ్వరరావు |
| | | శ్రీ జె. బాపురెడ్డి, ఐ.ఏ.ఎస్. |
| కార్యదర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు |
| | | డా. ఆర్వీయస్. సుందరం |
| సహ కార్యదర్శులు | : | డా. దివాకర్ల రాజేశ్వరి |
| | | డా. పి.యు.బి. శర్మ |
| | | డా. కె. చంద్రప్ప |
| | | డా. ఎం. రుక్మాంగద నాయుడు |
| | | శ్రీ వి. రామనరసింహారెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |

# చైతన్య కవిత

**మహారాజ పోషకులు:**

శ్రీ. డి.కె. ఆదికేశవులు

శ్రీనివాసాట్రస్టు, బెంగుళూరు

**రాజ పోషకులు:**

శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి), బెంగుళూరు

## 1994-1995లో చేరిన చందాదారులు:

**పోషకులు:**

డా॥ దివాకర్ల రాజేశ్వరి, బెంగుళూరు.

డా॥ కె. రామాంజనేయులు, రెంటచింతల, గుంటూరు జిల్లా.

శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధాని, నరసాపురం, పశ్చిమగోదావరి జిల్లా

**జీవిత సభ్యులు:**

శ్రీ షేక్ ఖాసిం, రిటైర్డు ఇంజనీరు, హైదరాబాదు.

డా॥ కొలకలూరి మధుజ్యోతి, ఆంధ్రోపన్యాసకురాలు,
శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి.

శ్రీ ఎం. రవిశేఖర్, ముద్దిరెడ్డిపల్లి, (వయా) హిందూపురం,
అనంతపురం జిల్లా.

శ్రీ జి. చిత్తనగిరి, దేవరహట్టిగ్రామం, గుడ్డద హళ్లి పోస్టు,
అనంతపురం జిల్లా.

శ్రీ జి. కృష్ణమూర్తి, పేలుబంద గ్రామం, కన్నెర పోస్టు,
అనంతపురం జిల్లా.

శ్రీ యస్. జగన్నాథేశ్వర, హేమావతి పోస్టు, అనంతపురం జిల్లా.

శ్రీమతి చౌడమ్మ, శ్రీ ఏటిగడ్డ రంగప్ప (డ్రామా మాస్టారు)
దంపతులు, ఊటకూరు, అనంతపురం జిల్లా.

శ్రీమతి నీలకంఠాపురం సుభద్రమ్మగారు, నీలకంఠాపురం,
అనంతపురం జిల్లా.

శ్రీ కారుపల్లి రాజారాం (కవి) జీబి, కెలమంగలం, ధర్మపురి జిల్లా,
తమిళనాడు.

**ప్రత్యేక సభ్యులు:**

ఆచార్య వేటూరి ఆనందమూర్తి, హైదరాబాదు.

కుమారి ఎ.బి. రాణి, ఆంగ్లోపన్యాసకురాలు, పాలకొల్లు,
పశ్చిమగోదావరిజిల్లా.

డా॥ ఎం. బాగయ్య, ఉస్మానియా విశ్వవిద్యాలయం స్త్రీల
కళాశాల, కోటి, హైదరాబాదు.

డా॥ వెలుదండ నిత్యానందరావు, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
స్త్రీల కళాశాల, హైదరాబాదు.

శ్రీ భళ్లమూడి శ్రీరామమూర్తి, విద్యాధరపురం, విజయవాడ.

డా॥ సుమతీనరేంద్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

ఆచార్య యస్జీడి. చంద్రశేఖర్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

ఆచార్య పాపిరెడ్డి నరసింహారెడ్డి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

డా॥ ముదిగొండ వీరభద్రయ్య, హైదరాబాద్ విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

డా॥ జి. వేదపారాయణ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

శ్రీ పింగళి సూర్యసుందరం, హైదరాబాదు.

డా॥ యు.వి.యస్.యస్. శాస్త్రి, రీజినల్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్,
మైసూరు.

డా॥ కట్టమంచి మహాలక్ష్మి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

డా॥ వి.ఆర్. రాసాని, తిరుపతి.

శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి, హైదరాబాదు.

డా॥ పి. ఉమ, ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసు.

డా॥ ఆర్. పద్మావతి, ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసు

డా॥ ఎ. అంబుజం, గుడ్‌షెపర్డ్ పబ్లిక్ స్కూలు, ఉదకమండలం,
తమిళనాడు.

డా॥ నరాల వీరయ్య, పద్మావతీనగర్, తిరుపతి.

ఆచార్య లకంసాని చక్రధరరావు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు,
విశాఖపట్టణం.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కడప.

డా॥ ఎ.బి. సాయిప్రసాద్, మద్రాసు

శ్రీ బలిజ ఈరణ్ణ, గవర్నమెంటుసైన్సు కాలేజి, బెంగుళూరు.

శ్రీ పెమ్మరాజు గోపాలకృష్ణ, ప్రకాష్‌నగర్, రాజమండ్రి.

శ్రీ కలువకొలను సదానంద, పాకాల, చిత్తూరు జిల్లా.

డా॥ రావూరి భరద్వాజ, విజయనగర్ కాలనీ, హైదరాబాదు.

శ్రీ డి. నాగసిద్ధారెడ్డి, కె.టి. రోడ్డు, తిరుపతి.

డా॥ యల్లటూరు శివరామిరెడ్డి, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

డా॥ యస్. బషీర్, ఎగ్మూర్, మద్రాసు

డా॥ వెలగా వెంకటప్పయ్య, ఐతానగరం, తెనాలి.

శ్రీ యస్.ఆర్. పృథ్వి, ఆర్యాపురం, రాజమండ్రి.

డా॥ ఎండ్లూరి సుధాకరరావు, తెలుగు విశ్వవిద్యాలయం,
రాజమండ్రి

శ్రీ కాసల నాగభూషణం, మద్రాసు

డా॥ వి. విద్యాలతారెడ్డి, మద్రాసు.

శ్రీమతి రుక్మిణీ రాజగోపాలన్, మద్రాసు.

డా॥ రావి ప్రేమలత, తిలక్ నగర్, హైదరాబాదు.

డా॥ దిగుమర్తి సుందర శివరావు, ప్రకాష్ నగర్, రాజమండ్రి.

శ్రీ చింతల గోపాలరావు, సంపాదకుడు, 'కోస్తావాణి', రాజమండ్రి.

ప్రకాశం జిల్లాలోని మార్కాపురం నుండి చేరిన ప్రత్యేక సభ్యులు:

(1994లో ప్రియమిత్రులు శ్రీ యెనిశెట్టి సాంబశివరావుగారి ప్రోత్సాహంతో మార్కాపురం నుండి ఈ క్రింది 21 మంది సాహిత్యప్రియులు 'చైతన్యకవిత'కు ప్రత్యేక సభ్యులుగా చేరారు. సాంబశివరావుగారికీ, ఆయా సభ్యులకూ మిక్కిలి కృతజ్ఞులం - సంపాదకులు)

1. శ్రీ డి. వెంకయ్యగౌడ్, 3/310 గోకుల్ స్ట్రీట్, మార్కాపురం, 523 316 ప్రకాశం జిల్లా.
2. శ్రీ టి. మునెయ్య, శాంతిక్లినిక్ దగ్గర, 10వ వార్డు, ...
3. శ్రీ ఎ. రామశేషయ్య, సత్యనారాయణస్వామి గుడిదగ్గర, ...
4. శ్రీ పి.ఎ.యస్. కేశవరావు, 4/176, తేరుబజారు, ...
5. కుమారి కె. శాయిలీల, హెడ్‌మిస్ట్రెస్, 11/75 K, రాధాకృష్ణ టాకీసు దగ్గర, ...
6. శ్రీ ఆర్.వి.యస్. మల్లికార్జునరావు, 4/166, రథంబజారు, ...
7. శ్రీ గొంట్లా సదాకేశవులు, 4/224, మెయిన్ బజారు, ...
8. శ్రీ గార్లపాటి ఆంజనేయులు, 3/404, అరవిందఘోష్ వీధి, ...
9. ప్రిన్సిపాల్, శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరీ కళాశాల, ...
10. శ్రీ చిర్లంచెర్ల చెన్నకేశవులు, సత్యనారాయణస్వామి గుడిదగ్గర, ...
11. శ్రీ చిర్లంచెర్ల చెంచయ్య, మున్సిపల్ ఛైర్మన్, నాయుడు వీధి, ...
12. శ్రీ తురగా శ్రీనివాస్, ఆడిటర్, అరవిందఘోష్ వీధి, ...
13. శ్రీ చలువాది కామేశ్వరరావు, 9/143, కస్తూరిబాయి వీధి, ...
14. శ్రీమతి వి. రాజ్యలక్ష్మి, తెలుగు లెక్చరల్, రెడ్డి మహిళా కళాశాల,
15. శ్రీ తాడువాయి మల్లికార్జునరావు, నాయుడువీధి, ...
16. శ్రీ పువ్వాడ రాధాకృష్ణయ్య, లెక్చరర్, రామలక్ష్మమ్మ వీధి, 10వ వార్డు, ...
17. శ్రీ మేడా సుబ్బారావు, 4/234 రాజాజి వీధి, ...

18. శ్రీ ఆర్. రామచంద్రరావు, లెక్చరర్, 10/507 సి ...

19. శ్రీ కె.సి.హెచ్. వెంకటరెడ్డి, కార్యదర్శి, రెడ్డి మహిళా కళాశాల, నెహ్రూ వీధి, ...

20. శ్రీ దిండకుర్తి కృష్ణమూర్తి, రామలక్ష్మమ్మ వీధి, 10వ వార్డు ...

21. శ్రీ సుగ్రీవ సత్యనారాయణ, 4/271 రాజాజి వీధి, ...

# భాగ్యనగరం

పరదాలో పరదారలో పడుచులో భావించగారాని అ
ప్సరసల్ సుందర మందయానలు, సురాపానానురక్తుల్ చిర
స్థిర భోగైక పరాయణుల్ పురుషులో దేవేంద్రులేయైననున్
జరదావాసన గుప్పునన్ తురక బాసల్ సాగు వావిప్పినన్.

భాగ్యనగరాన నెటకైన పయనమైన
నరుడు త్రొక్కు త్రిచక్రయానమ్మె దిక్కు
అదియు తరతమ భావమ్మునరయకుండ
అందఱకు నేర్పుచుండు పద్మాసనమ్ము!

\- దుగ్గిరాల రామారావుగారి చాటువులు

**(రచన: 1960)**



# SHANTHINIKETAN

Whitefield, Bangalore

Project Foundation Laid

By

**SHRI P.V. NARASIMHA RAO**

Hon'ble Prime Minister of India

On 17th November, 1995

**SHRI H.D. DEVE GOWDA**

Hon'ble Chief Minister of Karnataka

presided

Thanks to the economic and liberalisation policies of the Govt. of India under the able guidance of His Excellency, Shri. P.V. Narasimha Rao, Prime Minister of India and Govt. of Karnataka's initiatives for providing infrastructure for the development of Industry and Tourism, and the Government's policy of encouraging private entrepreneurs to develop infrastructure. Chaitanya Properties Pvt. Ltd. of the Audikesavulu Group has taken the lead in this field.

**SHANTHINIKETAN**

A home of one's own in Bangalore, even with the minimum of infrastructure is getting beyond the reach of the middle income group. It is in this background that Shanthiniketan, a new, integrated and self-contained facility is coming up. Shanthiniketan is 7 kms from the present Bangalore Airport and opposite to the Singapore Technology park in Whitefield.

Shanthiniketan in an area of 150 acres of land and with a project outlay of over Rs. 4,000 crores will have Residential Zones, Hospital, Educational Institutions, Community and Civic facilities, Parks, Hotels, Offices, Shopping Malls, Sri Sathya Sai Universal Centre state of the art International Convention Centre, etc.

## CLUB AND GOLF COURSE

Just 2½ kms away from Shanthiniketan is the Club and an 18 Hole Golf Course of international standards being developed by Chaitanya Properties. The facilities here will cater to Shanthiniketan, Sri Sathya Sai Universal Centre and others.

## AUDIKESAVULU GROUP

Shanthiniketan is one of the projects of the Property Development Division (Chaitanya Properties Pvt. Ltd.) of the well diversified Audikesavulu Group. One of the Directors of the Group, **Mr. K.M.Srinivasamurthy** is also the President of Federation of Karnataka Chamber of Commerce and Industry. **Mr. R. Premchander**, Managing Director, Amar Jyothi Spinning Mills Ltd. and **Mr. D.A. Srinivas**, Executive Director, Shree Vaani Sugars & Industries Ltd. are Directors of the Group. This professionally managed Group is engaged in Sugar, Steel, Food Processing, Breweries, Distilleries, etc. The Group has now entered the power generation sector as well.

## Shri A.N. HAKSER

Shri A.N. Hakser, (Former Chairman, ITC Ltd.,) the eminent corporate personality, is the Advisor to the project, Shanthiniketan.

## FEATURES OF THE PROJECT

1. High rise residential apartments
2. Mid rise apartments
3. Low rise apartments
4. Bunglows and Villas
5. Sri Sathya Sai Universal Centre state of the art International Convention Centre.
6. Delux Star Hotel with 400 Rooms
7. Shopping Complex
8. Office Block
9. Hospital
10. Research Centre
11. Club House
12. School
13. Park

## OTHER FEATURES

- Effluent Treatment Plant
- Uninterrupted Water Supply
- Stand-by captive power supply

**Phase I:** Between 24 and 36 months

**Phase II:** Within 60 months

## ARCHITECTS

i) Mr. Ramesh Khosla
Arcop Associates Pvt.Ltd.
Canada

ii) Sundaram Consultants
Bangalore

iii) Zacharia Consultants
Bangalore

## PROJECT ASSOCIATES

i) ECC Constuction Group
Larsen & Turbo Ltd.

ii) UNITECH Limited



' కవి జహాఁపనా '

రాయలసీమ కవిరత్నం

కీ. శే. కలుగోట్ల విజయాత్రేయ

